

"దొరికితే దొంగలు" లో జమున






మాధవీ ప్రొడక్షన్స

# పాండవ వనవాసము




దర్శకత్వం: K. కామేశ్వరరావు B.A



నిర్మాత
A.S.R. ఆంజనేయులు



వాహినీ రిలీజ్

కృష్ణ
సుకన్య



ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన తొలి తెలుగు సాంఘిక చిత్రం
అంతా కొత్తవారతో నటించిన సంచలన చిత్రం.
బాబూ మూవీస్ వారు సగర్వంగా సమర్పించు

# తేనె మనసులు

దర్శకుడు. ఆదుర్తి సుబ్బారావు నిర్మాత సి. సుందరం
కోడైరెక్టర్ కె. విశ్వనాథ్ సంగీతం మహదేవన్
స్టుడియో శ్రీ సారథి శ్రీ ఫిలింస్ విడుదల.

* సంధ్యారాణి

NVKR

# ఉత్తరాలు

## భాషా సమస్య

దక్షిణాది రాష్ట్రాలలో హిందీని మొదట ఒక నేర్చుకోవలసిన భాషగాగానీ, లేదా ముఖ్యమయిన భాషగాగాని గుర్తించలేదు. తరువాత (అనగా హిందీని రాజభాషగా చేయాలన్న నిర్ణయం తీసుకొన్న) కూడ దక్షిణాది రాష్ట్రాలలో హిందీని వ్యాప్తి చేయడంకోసం ప్రభుత్వం అట్టే శ్రద్ధ కనపరచలేదు. నిన్నటివరకు హిందీలో పది హేను మార్కులువస్తే పాస్ చేసేస్తున్నారు. అందువలన హిందీయేతర రాష్ట్రాలలో హిందీకి వలసినంత ప్రాధాన్యం ఇవ్వబడలేదు. ఇప్పుడు హఠాత్తుగా హిందీ నేర్చుకోమనటం చాలా బాధాకరమైన సంగతి.

ప్రజలలో తీవ్ర సంచలనం కలిగింది, ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా తిరిగిన ఏ ప్రభుత్వం అట్టే కాలం నిలబడదు. ప్రజా జీవితంతో చెలగాటమాడుతున్న భాషా సమస్య తీవ్రతరం కాకూడదు. అయినా తేల్చవలసిన సమస్యలు వేలాది యుండగా భాషా సమస్యను పట్టుకొని కూర్చుంటే భారత దేశ సంస్కృతికే గొడ్డలిపెట్టని వేరే వ్రాయనక్కరలేదు.

కాకర్ల హరనాథ్ (వాల్తేరు)

*　　*　　*

ఈ హిందీ భాషా వివాదం, వివాదాలదాకా పెరిగి, వినాశాలవద్ద ఆగింది. ఇంతవరకూ ఉన్నట్లే ఇంగ్లీషు అధికార భాషగా, హిందీ రాష్ట్ర భాషగా ఉన్నట్లయితే ప్రభుత్వమువారికి ఏమి నష్టమో. ఇప్పుడు హిందీని క్రొత్తగా ప్రవేశపెట్టడంవల్ల లాభమేమిటో బోధపడదు. ప్రస్తుతం బలవంతంగా హిందీని ప్రవేశపెడతామన్నందువల్ల అటు ప్రభుత్వానికి ధన నష్టం, ఇటు ప్రజలకు ప్రాణ నష్టం కూడ సంభవించింది. కాని ఎవ్వరికీ లాభం లేదు. ఒక్కసారిగా హిందీ భాషనే నేర్చుకోవాలంటే ప్రజలు ఎలా అనుసరిస్తారు. ఇంగ్లీషు అంతర్జాతీయ భాష కాబట్టి ఇతర దేశాలతో కూడ పత్ర వ్యవహారములు మొదలగునవి జరుప వచ్చును. అన్ని దేశాలలోనూ హిందీ లేనందువల్ల చాలా ఇబ్బంది అవుతుంది. ప్రభుత్వ ఉద్యోగులు, విద్యార్థులు ఈ గందరగోళం మీదపడేసరికి ఎటూ తేల్చుకోలేక వీరి పరిస్థితి త్రిశంకుస్వర్గంలా తయారయ్యింది. ఈ భాషా ప్రవేశ విధానం లేని పోని అలజడికి కారణ భూతమయ్యింది. కాబట్టి ప్రజలందరి వాదాన్ని శాంతంగా విని సముచితమైన పరిస్థితిని కల్పించడం ప్రభుత్వపు కర్తవ్యం. త్వరలోనే ఇపుడు జరుగుతున్న విధ్వంసక చర్యలు ఆపి, హిందీ భాషా ప్రవేశాన్ని విరమించుకొంటారని ఆశిద్దాం.

బి. ఏ. నాగేంద్రబోస్ (మడకశిరా)

*　　*　　*

ఈమధ్య పత్రికల వారంతా హిందీ భాషా వ్యతిరేకతకే ప్రాధాన్యం ఇచ్చినట్లు కన్పిస్తోంది. ఈ సమస్యను ఉద్వేగ రహితంగా నిష్పక్షపాతంగా ఆలోచిస్తున్నట్లులేదు. మన దేశానికి ఇప్పుడు కాకపోయినా ఇక ముందైనా ఒక జాతీయ భాష అంటూ ఉండాలనేది నిర్వివాదాంశం. రాజ్యాంగంలో పేర్కొనబడిన 14 భాషల్లో ఏ ఒక్కదానికైనా ఆ అర్హత ఉందా? ఇప్పుడు లేకపోయినా ఇక ముందెప్పటికైనా ఆ అర్హత వస్తుందా? భాషను మనం అధికారభాషగా ఆమోదించినా ఆ భాష మాతృభాషగా కలిగిన రాష్ట్ర ప్రజలు ఉద్యోగాల్లోగాని, ఇతరత్రాగాని ఎక్కువ అవకాశాలు పొందడం తప్పదుకదా. అందుచేత మిగతా రాష్ట్ర ప్రజలు తద్వ్యతిరేకంగా ఆందోళన లేవదీసే అవకాశం కూడా ఉంది. ఈ వివాదం పరిష్కారం కావాలంటే ఎవరికీ మాతృభాష కానిదీ ఎవరికీ సరిగ్గా రానిదీ అయిన సంస్కృతం లాంటి భాషను అధికార భాషగా చేయాలని లేకపోతే ఇంగ్లీషునే శాశ్వతంగా ఉంచాలని కొన్ని సూచనలు వినిపిస్తున్నాయి. హిందీ అధికార భాష కాకూడదనేవారు, కావాలనేవారు కూడా ఈ విషయాన్ని కూలంకషంగా ఆలోచించి పరిష్కార మార్గాన్ని కనుక్కోవాలి. ఏది ఎలా ఉన్నా ఈ సందర్భంలో జరిగిన అల్లకల్లోలం అత్యంత బాధ్యతా రహితంగా జరిగిందని చెప్పక తప్పదు.

పరిమి గోపాలరావు (పోలవరం)

## కథలు

యద్దనపూడి సులోచనారాణిగారు వ్రాసిన "ఓడిపోయాను" కథ చాలా బాగున్నది.

అయితా మల్లేశ్వరరావు. (సూళ్ళూరుపేట)

*　　*　　*

"ఓడిపోయాను" అన్న కథ ఎంతోబాగుంది, ప్రతిఒక్కరి మనస్సును ఆకర్షించి జీవితాంతము మర్చి పోకుండాచేస్తు ప్రేమికులకు ఒక గుణపాఠముగాను వుంది. కథ చదివిన ప్రతిఒక్కరు తమజీవితంలో అలాటి ఆవేశాలను పొందక వుంటారని ఆశించవచ్చు. ఈలాటి కథలు వ్రాసినందులకు రచయిత్రికి మా హృదయ పూర్వక ధన్యవాదములు.

రవికాంత్ (కడప)

*　　*　　*

"ఓడిపోయాను"(19—2—65 సంచికలో ప్రచురించినది) కథలో సహజత్వం, నిండుగా వుందని చెప్పడంలో అతిశయోక్తి లేదు. "ఓడిపోయాను!"అని కథకు నామకరణంచేసి, కథలో ఎవర్నీ ఓడకుండా చేయడంలో రచయిత్రిగారు చూపిన చాకచక్యం, నేర్పు వర్ణనాతీతం. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు తెలుప గోరుతాను.

వి లక్ష్మీ నరసయ్య. (ప్రొద్దుటూరు)

*　　*　　*

"ఓడిపోయాను" కథలో క్రికెట్టును గురించి కాస్త ఎక్కువగనే వ్రాశారు. బాగుంది. కాని చెప్పనుగ, టెస్టు క్రికెట్టులోనికి ఎవరుగాని 'దెబూ' చేయడమంటు ఇంతవరకు ప్రపంచ క్రికెట్టు చరిత్రలో జరిగినట్లు లేదు. రచయిత్రిగారు ఈ విషయమును గమనించియుండిన కథ వాస్తవికతకు మరింత దగ్గరయ్యేదిదేమో! బంతి పట్టుకుంటున్నప్పుడు క్రిందపడి దెబ్బ తగిలిందనడం కన్నా, ఏ బంపర్ తీమరో, బవున్సరో తగిలి రాజా గాయపడ్డాడని వ్రాసింటే కథ మరీ బాగుండేది.

వై. ఎస్. కుమారస్వామిరాజా. (మద్రాసు)

## కాంబోడియా....

12—2—65 వ తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించిన కాంబోడియా గురించిన వ్యాసము, పురాతన శిల్పాలను, వాటి ప్రాభవాన్ని తెల్పే దృశ్యాలు చాల బాగున్నవి. కాని మొదటి ఫోటోక్రింద "అంకార్‌వాల్‌లోని ఒక ఆకర్షణీయమైన దేవాలయం" అని వ్రాసి ఉంది. కాని అది "అంకార్‌వాట్" అని ఉండాలి. "అంకార్‌వాల్" కాదు.

కె. యస్ శేషన్ (మదనపల్లి)

* 'వాట్'లో ఒక అక్షరం మారింది. 'ట్, బదులు' 'ల్' ధవయిత వాడారు. ★


**Statement about ownership and other particulars about newspaper**

**ANDHRA SACHITRA VARAPATRIKA**

1. Place of Publication Madras
2. Periodicity of its publication Every Friday
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1
4. Publisher's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 29, Chamier's Road, Madras-28.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29, Chamier's Road, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1-3-65.　　**S. RADHAKRISHNA,** Signature of Publisher.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 5-3-'65
క్రోధినామ సం॥ ఫాల్గుణ మాస శు॥ విదియ
సంపుటము : 57 సంచిక : 27

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120 00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీ. మద్రాసు-1



"ఓ! మంత్రిగారి అల్లుడుగారా? మేనేజింగ్ డైరెక్టర్‌గా యిప్పుడే నియమిస్తున్నాం! అర్హతలనవసరం."

## మనలో మాట

కొంతకాలం క్రితం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రిక్షా లాగేవారు, రైల్వే పోర్టర్లు, హోటళ్లు మొదలయిన వస్తువులమీద సచిత్ర వ్యాసాలు వేశాము. ఇటీవల ఇటువంటి సచిత్ర వ్యాసాలు మరికొన్ని వేశాము. ఈ వారం ఒక మద్రాసు హోటలులో 'సర్వర్' పనిచేసే అబ్బాయిని గురించి బొమ్మలతో సహా ఒక వ్యాసం ప్రచురిస్తున్నాము...

* * *

కీ॥ శే॥ ప్రతాప్‌సింగ్ ఖైరాన్ హత్యను గురించి, ఈ పత్రిక తయారయ్యే సమయానికి, కొత్త సమాచారం ఏదీ వెలువడలేదు. రెండు చిత్రాలు మాత్రం (ఒక చిన్న సమీక్షతో) ఈ సంచికలో చూడవచ్చు.

* * *

భాషా సమస్య విషయంలోనూ ఈ వారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముద్రణకి పంపేవేళకి ముఖ్యమయిన ప్రకటన ఏదీ వెలువడలేదు. కాని, ఈ సమస్యకి సంబంధించిన ప్రశ్నలని కొన్నిటిని మాత్రం 9 వ పేజీలోని సమీక్షలో పాఠకులకి, పరిశీలనార్థం, అందచేస్తున్నాము...

న్యూఢిల్లీ లేఖలో కూడా శ్రీ శ్రీకృష్ణ 'హిందీసమస్య'నే చర్చించారు. శ్రీ శ్రీకృష్ణ మాతృభాష హిందీ...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి వానంతి (ఫోటో. ప్రభాకర్)
మధ్యపేజీలలో. "సింహాచలక్షేత్రమహిమ"లో కృష్ణకుమారి



పంజాబ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ ప్రతాప్‌సింగ్ కైరాన్ ఫిబ్రవరి 6 వ తేదీన ఢిల్లీకి 18 మైళ్ల దూరంలో హత్య కావింపబడ్డారు. ఆయన కారు వెనుక సీట్లో పడి వున్న దృశ్యం.

## కైరాన్ హత్యోదంతం

# దేశంలో శాంతిభద్రతలు కొరవడినట్లేనా?

పంజాబు మాజీ ముఖ్యమంత్రి శ్రీ ప్రతాప్‌సింగ్ కైరాన్, ఇటీవలనే ఢిల్లీకి సమీపంలో హత్య చేయబడిన వుదంతం గురించి యీ నాటికీ రాజకీయరంగంలోను, ప్రభుత్వ రంగంలోను తర్జనభర్జనలు జరుగుతునేవున్నాయి. శ్రీ కైరాన్‌తో పాటు మరి ముగ్గురిని కూడా తుపాకితో కాల్చివేయటం జరిగింది.

ఈ కేసు ఆచూకీ తీయటం సులభమని పోలీసు పెద్ద ఒకరు చెప్పారు. అలా చెప్పి, పదిరోజులు అవుతున్నా ఇంతవరకు ముఖ్యమైన విషయాలేవీ వెల్లడి అయినట్లు కనిపించదు. అయినా, పోలీసులు మాత్రం నేరస్థుల కోసం గట్టి నిఘా వేసి వున్నారు.

శ్రీ కైరాన్ హత్యకు ప్రబలమైన రాజకీయ కారణాలున్నాయని పలువురు ప్రస్తావించారు. ముఖ్యంగా ఇటీవలి రోజుల్లో శ్రీ కైరాన్ పంజాబులో లేవదీసిన కలతలు, కాంగ్రెస్ సంస్థ పాలిట పెద్ద సమస్యలుగా తయారయ్యాయి. ఈ హత్య వెనుక రాజకీయాలేవీ లేవని కేంద్రమంత్రి శ్రీ నందా అంటున్నారు.

ఈ హత్యతో, మన దేశంలో వ్యక్తిగత జీవితాలకు అవసరమైన శాంతిభద్రతలు కొరవడ్డాయని అనిపిస్తున్నది. ప్రభుత్వరంగంలో పెద్ద అధికారీ, సొలిసిటర్ జనరల్ అయిన శ్రీ హేమనాథ్ సన్యాల్ హత్య కూడా యీ మధ్యనే జరిగింది.

శ్రీ కైరాన్ హత్య జరిగేందుకు కొన్ని నిమిషాల క్రితం హంతకులు అక్కడికి సమీపంలో వున్న గ్రామస్థులతో మాట్లాడుతూ "ఈ తుపాకులతో పిచ్చికుక్కలను చంపుతూ వుంటాం" అన్నారట! ★

న్యూఢిల్లీనుంచి శ్రీకృష్ణ [illegible]

# భాషా సమస్యపై పత్రికల భావాలు

భాషాసమస్య ఈ వారమంతా పత్రికల్లో ఎక్కువ చోటు చేసుకున్నది. క్రింద యివ్వబడిన కొన్ని పత్రికల్లోని వార్తలని చూస్తే ఆ విషయం వాస్తవమని తెలుస్తుంది.

'ది స్టేట్స్‌మన్': 'ది పేట్రియాట్': రాజీ కుదరదని ఈ భాషా సమస్య ప్రభుత్వానికి ప్రమాదకరమని శ్రీమతి ఇందిరాగాంధి చెప్పినట్లు భాషాసమస్య అందరికీ అనుకూలంగా పరిష్కారం చేయాలని సూచించింది.

మద్రాసులో నెలకొన్న ప్రస్తుత ప్రశాంత పరిస్థితిని గూర్చి టైమ్స్ ఆఫ్ ఇండియా వ్రాస్తూ— దేశంలో ఉద్రిక్త పరిస్థితి ఇంకా సర్దుకోలేదని, పటిష్ఠమైన విధానాన్ని ప్రభుత్వం అవలంబించాలనీ, అయినా ఇంగ్లీషు అధికార భాషగా చిరకాలం ఉండనేరదని చెప్పింది. భాషాసమస్య పరిష్కారం వాయిదా వేయటం ప్రస్తుత పరిస్థితుల్లో మంచి పని కాదని వ్రాసింది.

ఈ సమస్య పరిష్కారం ఎక్కువ పరిధిలో విద్యార్థుల్ని, మామూలు పౌరుల్ని కూడా సంతృప్తి పరచేదిగా ఉండాలన్న అభిప్రాయాన్ని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' వెలిబుచ్చింది.

భాషా సమస్య ప్రభుత్వం తన ఆదర్శాన్ని మార్చినందువల్ల పరిష్కరింపబడదనీ, జనవరి 26 న ప్రభుత్వం హిందీని అధికారభాషని చేస్తూ దీనివల్ల ఇంగ్లీషు వాడకూడదన్న నియమమేమీ లేదని హామీ యిచ్చింది అంటూ 'హిందూస్థాన్ టైమ్స్' వ్రాసింది.

'నేషనల్ హెరాల్డ్' తన సంపాదకీయంలో రెండు భాషలూ (హిందీ, ఇంగ్లీషు) అధికార భాషలుగా వ్యవహరింపబడాలన్న వాదానికి మొగ్గు చూపుతూ ఈ శాశ్వత ద్విభాషా విధానంవల్ల జాతీయ సమైక్యత దెబ్బతినగలదని కూడా సూచించింది.

శ్రీ సుబ్రహ్మణ్యం రాజీనామావల్లే కేంద్రంలో అలజడి చెలరేగింది గదా! అందువల్ల రెండు భాషలూ అధికార భాషలుగా ఉండటం మంచిదని జలంధర్ నుంచి 'ట్రిబ్యూన్' పత్రిక ప్రస్తావించింది.

హిందీని దక్షిణాది వారిపై బలవంతంగా రుద్దకూడదని హిందీయేతరులను సమర్థిస్తూ "పయనీర్" వ్యాఖ్యానించింది. రాజ్యాంగాన్ని పండిత నెహ్రూ చెప్పిన విధంగా సవరిస్తే ప్రజలుగానీ, హిందీగాని నష్టపడరని కూడా తెల్పింది.

కాంగ్రెస్‌వారే కాంగ్రెస్ ప్రభుత్వం పడిపోవడానికి దోహద మిస్తున్నారు. ఈ వివాదాన్ని ప్రజాస్వామ్య పద్ధతిలో సాధించలేకపోతే ప్రభుత్వం దెబ్బతినేది నిజం అని 'నవజీవన్' అనే మళయాల పత్రిక అభిప్రాయం.

ఇండియాను స్వతంత్ర దేశంగా రూపొందించేందుకు తోడ్పడింది ఇంగ్లీషేనని, స్వాతంత్ర్య పోరాటం ఇంగ్లీషు ద్వారానే జరిగిందని, మొన్న శాస్త్రిగారు రేడియోలో మాట్లాడింది కూడా ఇంగ్లీషులోనేనని., ఇంగ్లీషువల్లనే సమైక్యత సాధింపబడుతుందని మళయాళ పత్రిక 'ఎక్స్‌ప్రెస్' వ్రాస్తూ, కొంతకాలం ఇంగ్లీషు ఉండాలని సూచించింది.

భారత రాజ్యాంగం పదిహేనేళ్ల నుంచి సవరణలకు అలవాటుపడినదే! ప్రజల సౌఖ్యం కోసం వారు కోరినట్లు రాజ్యాంగాన్ని మార్చటంవల్ల ఏ కళంకం ఆపాదించబడదంటూ 'హిందూస్థాన్ స్టాండర్డ్' సూచించింది.

అధికార్ల దౌర్జన్యానికి, వూరడింపు మాటలకీ ఉపశమించదు ప్రజానీకం. రాజ్యాంగంలో మార్పు వస్తేనే ప్రజల్లో శాంతి నెలకొంటుంది. అంటూ కలకత్తా నుంచి వెలువడే 'అమృతబజార్' వ్రాసింది.

బెంగాలీ పత్రిక 'ఆనందబజార్' అభిప్రాయం ప్రకారం— "దేశైక్యత యింతకుముందెప్పుడు ఇలాంటి సవాల్ నెదుర్కోలేదు. ప్రజలకు శ్రీ శాస్త్రి చెప్పినది విన సొంపుగానే ఉన్నది. వాగ్దానాల సంగతేమిటి ? ఆయన తన ఉత్తర్వును ఉపసంహరించుకోక దాని అమలును మాత్రం వాయిదా వేశారు. రాజ్యాంగచట్ట మేమీ ప్రకృతి శాసనం కాదు మార్పు లేదనుకోడానికి. అలాంటిది ప్రజల కోసం రాజ్యాంగంలో ఒక్క మాట కూడా మార్పు వీలులేదంటే ఎలా నమ్మటం?"

శ్రీ శాస్త్రి చెప్పిందాంట్లో దక్షిణాత్యులని సమాధానపర్చగలిగిందేదైనా ఉందంటే .... కేంద్రం దక్షిణాత్యుల అభిప్రాయాన్ని ఎప్పటికైనా పొందాలంటే, శాశ్వతమైన పరిష్కారం ఒక్కటే మార్గం. తతిమ్మా సమస్యలన్నీ పరిష్కరించటం తేలిక— అని బెంగాలీ పత్రిక 'జుగంతర్' వ్రాసింది.

శ్రీ శాస్త్రిగారిచ్చిన హామీలు కేంద్రంలోని బాధ్యతాయుతులైన ఇద్దరు మంత్రులనే సమాధాన పర్చలేనప్పుడు దక్షిణాదిన ఉద్రిక్త యువ సమూహాన్నెలా వూరడిస్తాయి ? అంటూ బెంగాలీ పత్రిక 'వసుమతి' వ్యాఖ్యానించింది.

'ఆంధ్ర పత్రిక' దీన్ని గురించి వివరిస్తూ— మొన్న దక్షిణాదిన జరిగిన దౌర్జన్యకాండలు హిందీ అమలుకు ప్రజలెంత సుముఖులుగా ఉన్నదీ నిరూపిస్తుంది. బలవంతంగా హిందీని హిందీయేతరులపై రుద్దము అనే వాగ్దానాలు కళ్ల నీళ్లు తుడవటానికే నని, వాటివల్ల దక్షిణాత్యులు శాంతించరని,



కైరాన్‌తో పాటు కారులో ప్రయాణం చేస్తున్న శ్రీ బలదేవ్ కపూర్ కూడా హత్యకు గురి అయ్యారు. (6వ పేజీ చూడండి.)

## న్యూఢిల్లీ లేఖ

ఇంగ్లీషు శాశ్వతంగా అధికార భాషగా ఉంటుందన్న ఒక్క మార్గం ద్వారానే ఈ సమస్య పరిష్కారం సాధ్యపడుతుందని వ్యక్తపరిచింది.

ఎన్నో సమస్యల్ని పరిష్కరించలేక సతమత మవుతున్న ఈ తరుణంలో భాషాసమస్య అయిక్యతను దెబ్బతీసేదిగా ఉందని, నెహ్రూగారు సూచించిన విధంగా హిందీయేతరుల యిష్టప్రకారం ఇంగ్లీషునే అధికార భాషగా ఉంచటం శ్రేయస్కరమని 'ఆంధ్రప్రభ' సూచించింది.

* * *

దేశానికి అధికార భాషగా తెలుగు గానీ, తమిళం గానీ అయి ఉన్నట్లయితే హిందీ ప్రాంతాలవారి కెంత యిబ్బంది కలిగిఉండేది ? అది వాళ్ళకి కొత్త భాషే కదా !

ఇంకా కొన్ని ఆసక్తికరమైన విశేషాలివారంలో జరిగాయి. మద్రాసులో జరిగిన అలజడులకి నిరసనగా ఆచార్య వినోబా నిరాహారదీక్ష పూనారు. అయితే మహారాష్ట్రులు బొంబాయిని తమ రాష్ట్రం నుంచి వేరుచేయాలన్నప్పుడు జరిగిందానికి వీరేం చేశారు ?

ఇక రెండో విషయం—శ్రీ వినోబా నిరాహారదీక్ష మొదలుపెట్టారనంగానే శ్రీ నందా నిమిషాలమీద ఆయన దగ్గరికి పరిగెత్తుకెళ్ళారు కానీ, రామేశ్వరంలో జరిగిన జలప్రళయంలో రెండువందల మంది నీటిలో సమాధైపోయి, ఒక రైలు వరదల్లో కొట్టుకు పోయినప్పుడు కనీసం పార్లమెంటరీ సెక్రటరీ అయినా చూడ్డానికి వెళ్ళారా ?

శ్రీ వినోబా తమ మూడు అంశాల సూత్రాన్ని ఆమోదిస్తేగానీ దీక్షను విరమించ నన్నారట. అదేమిటంటే—దౌర్జన్యాన్ని విడనాడాలి (ప్రజలు), హిందీని బలవంతంగా హిందీయేతరులపై రుద్ద కూడదు, అలాగే హిందీ ప్రజలపై కూడా ఇంగ్లీషుని బలవంతంగా అమలుపరచకూడదు. ఇది ప్రాంతానికీ, భాషకీ సంబంధించినది కాదు. దేశ ఐక్యతకు సంబంధించింది. రెండు భాషలు దేశానికి అధికార భాషలైనప్పుడు ఉత్తర, దక్షిణ భారతాల్ని కలిపే వ్యవహారభాష ఏది ? హిందీని అమలు పర్చటం వల్ల హిందీ ప్రాంతానికీ, ప్రభుత్వానికీ మధ్య ఇంగ్లీషు వ్యవహరింపబడదు కదా! దీనినిబట్టి పరోక్షంగా హిందీని ఒప్పుకోమని హిందీయేతరులను శ్రీ వినోబా భయపెడ్తున్నారన్నమాట !

పార్లమెంటులోని మహారాష్ట్ర సభ్యులు దక్షిణాదిన జరిగిన అలజడిని విమర్శించారట. బొంబాయి విషయంలో వాళ్ళు చేసింది ఒకసారి గుర్తు చేసుకుంటే బాగుంటుంది. గుజరాతీల పట్ల వాళ్ళెలా వ్యవహరించారు ?

నలభైతొమ్మిదిమంది పార్లమెంట్ సభ్యులతో కలసి మైసూర్ ప్రతినిధి శ్రీ అజిత్‌ప్రసాద్ యిచ్చిన స్టేట్‌మెంట్‌లో భాషా విషయం ప్రస్తుత ఉద్రిక్త పరిస్థితుల్లో పరిష్కారం చెయ్యబడదన్నారు. అలాగైతే హిందీని అధికారభాష ఎలా చేశారు ? హిందీ ప్రాంతాలవారి ఆందోళనవల్ల కాదా ?

హిందీ దేశైక్యతను సాధించలేక పోతుంది. కాబట్టి ఈ భాషా సమస్యను పునరాలోచించాలని శ్రీమతి ఇందిరాగాంధీ చెప్పిన విషయం ఒక్కటే ఆదర్శవంతంగా అనిపిస్తున్నది !





ఇటీవలనే మద్రాసులో జరిగిన హిందీ వ్యతిరేక ఉద్యమం సందర్భంలో విద్యార్థులు ఎగ్మూర్ రైల్వేస్టేషను వద్ద గుమిగూడిన దృశ్యం.

# భాషాసమస్యా సమీక్ష: కొన్ని ప్రశ్నలు

హిందీ వ్యతిరేకోద్యమం మద్రాసు రాష్ట్రంలో ఒక తుఫానులాగ లేచి తగ్గిపోయింది. ఇంకా పూర్తిగా తగ్గిపోయిం దనటానికి వీల్లేదు. ఆంధ్రరాష్ట్రంలో కూడా అల్లర్లు కొన్ని జరిగాయి. విచక్షణ లేకుండా విధ్వంసకాండ జరపటం మంచిదని సాధారణంగా దేశ శ్రేయస్సు కోరేవా రెవరూ అనరు. అంతే కాక ఇటీవల జరిగిన కాల్పులు, హత్యలు కేవలం హిందీ ద్వేషులు మాత్రం చేసినదని కూడా చెప్పలేము. ప్రస్తుత పరిస్థితులపట్ల అసంతృప్తి చూపేవారూ, ప్రభుత్వానికి హాని చేద్దామని తల పెట్టినవారూ కొద్దో, గొప్పో 'హిందీ అల్లర్ల' లో పాల్గొని ఉండవచ్చు. (మద్రాసులో జరిగిన సంఘటనలలో హిందీని వ్యతిరేకించేవారు మామూలు ప్రజలమీద చెయ్యి చేసుకున్నట్లు ఏ రుజువూ లేదు, శ్రీ భక్తవత్సలం ఇంటిమీదకి కొందరు గుంపుగా వెళ్లే ప్రయత్నంలో జరిగిన అల్లరిలో ఒక్క విద్యార్థి కూడా పాల్గొనలేదని ఒక పోలీసు అధికారి అనగా ఈ విలేఖరి విన్నాడు.) కాని, అత్యవసరంగా ఇంగ్లీషుని నిరాకరించి హిందీని ప్రవేశపెట్టే ప్రయత్నాలు 'హిందీ అల్లర్ల' వల్లనే చాలావరకు తగ్గాయనటంలో అతిశయోక్తి లేదు. కాంగ్రెసు నాయకులు కొందరికి హిందీ వ్యతిరేకోద్యమం కనువిప్పు కలిగించింది.

హిందీని బలవంతంగా దక్షిణ భారతదేశ ప్రాంతాలలో, ప్రత్యేకంగా మద్రాసు రాష్ట్రంలో ప్రవేశింపజూసే ప్రయత్నాలు తగ్గుతాయని చెప్పవచ్చు. అయితే ఈ సందర్భంలో కొన్ని ప్రశ్నలు ఉదయిస్తాయి. మద్రాసు మొదలయిన ప్రాంతాలలో హిందీని ఇప్పుడు అధికార భాష చేస్తే ప్రజలకి ఇష్టం ఉండదని ఇక్కడి ప్రముఖ రాజకీయ నాయకులకి తెలియదా ? కొంతకాలం నుంచి వారు చేస్తున్న హిందీ ప్రచారం సంగతేమిటి ? ఇంత అల్లరి, ఇంత ప్రాణనష్టం కలిగేదాకా ప్రజాభిప్రాయం వారికి అర్థంకాలేదా ? ఈ ప్రశ్నలకి సమాధానాల సంగతి అటుంచి, మరికొన్ని ప్రశ్నలు కూడా దక్షిణ భారత ప్రదేశాలలోని హిందీ వ్యతిరేకులు తమకి తామే వేసుకోవాలి. ఇక్కడివారికి హిందీ యిష్టంలేదు సరే, ఇంగ్లీషు ఇష్టంలేని ఉత్తర భారతీయుల సంగతేమిటి ? వారి తలల మీద ఇంగ్లీషు రుద్దగలమా ? అసలు, కొంతకాలం క్రితం మద్రాసు రాష్ట్రంలో ఇంగ్లీషులో విద్యాభ్యాసం మాన్పించి తమిళ భాషలో పాఠాలు నేర్పాలనే విధానాన్ని సి. సుబ్రమణ్యమే అమలు పరచారు ! ఈ రాష్ట్రంలో ఉన్న తమిళేతరుల అభిప్రాయం గురించి వారు ఆలోచించారా ? (ఈ విధానాన్ని మార్చి తిరిగి ఇంగ్లీషు పెట్టినది నేడు ఇంగ్లీషు మాత్రమే కావాలని కోరే విద్యార్థుల కోపానికి గురి అయిన శ్రీ భక్తవత్సలం !...)

ఉత్తర భారతదేశ రాష్ట్రాల వారందరికీ హిందీ 'సొంత' భాష కాకపోవచ్చు కాని దేశం మొత్తం మీద హిందీవాదుల సంఖ్యే ఎక్కువ కావచ్చు. ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహార్, పంజాబు, హిమాచల ప్రదేశ్‌లతో మహారాష్ట్ర, గుజరాత్‌లు కలిస్తే హిందీ వ్యతిరేకించేవారి సంఖ్యని మించగలరేమో! ఒకవేళ, మద్రాసు, ఆంధ్ర, మైసూరు, కేరళ, బెంగాల్, అస్సాంలు ఏకమయి వారిని ఎదిరించినా దేశ శ్రేయస్సుకి ఎంత ముప్పు వస్తుందో ఊహించటం కష్టం కాదు— కనీసం, అటువంటి వైరం దేశశ్రేయస్సుని పెంపొందించలేదు.

అందుకనే, అన్నిరాష్ట్రాల నాయకులూ, అన్ని పార్టీలవారూ కలిసి అన్నిప్రాంతాలవారికీ నచ్చే ఒక విధానాన్ని సృష్టించి వీలయినంత త్వరలో అమలుపరచటం చాలా అవసరం. శ్రీ నెహ్రూ హామీలను గురించి ఎన్నో ప్రకటనలు వెలువడ్డాయి, ఇంకా వెలువడుతున్నాయి. కాని, కేవలం వ్యక్తిగతంగా ఇచ్చిన హామీలకి ఎంతమాత్రం విలువ ఉండగలదు ? శ్రీ నెహ్రూ జీవించి ఉండగానే వాటి విలువ అంతమాత్రంగా ఉండేది. ఆయన మరణించిన సంవత్సరం లోపుగానే హిందీ మాతృభాష కాని వారితో ఇంత సంచలనం వచ్చింది !

ఉన్నత విద్యకీ, కేంద్ర—దక్షిణ ప్రాంతాలవారి మధ్య వాడటానికీ ఇంగ్లీషు ఇంకా చాలాకాలం దాకా ఉండాలి, ఉండి తీరుతుంది. హిందీ అదంతట అదే అఖిల భారతదేశ భాష స్థాయిని సంపాదించుకొనగలిగితే సరే. అంతవరకూ అధికార భాషగా ఇంగ్లీషుని పూర్తిగా రద్దు చెయ్యటం మంచిదికాదు.

[ఈ సంచిక తయారయ్యే సమయానికి 'భాషా సమస్య' విషయమయి స్పష్టమయిన ప్రకటన ఏదీ ఢిల్లీనుంచి వెలువడలేదు.]

—(ఒక విలేఖరి) ★

దురదలు
దురదలు

# దురదలా?
# అమృతాంజన్ లిమిటెడ్‌వారి డెర్మల్ ఆయింట్‌మెంటు

రాస్తే మంచి గుణం ఇస్తుంది!
తామరకు పాసిన కాళ్లకుకూడా అమోఘమైనది.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT AM/DO 2813

# ఫ్రూటాల్

FRUITOL

★ ఇండియా క్యానింగ్ ఇండస్ట్రీస్ ... విజయవాడ

కే. టి. కృష్ణమూర్తి అచ్చారిగారి

## "మేల్ మాయిల్ మందు

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, గజ్జి, మరియు చెడ్డనీరు వ్యాపించి సంగుంచే ఏర్పడు విగుగు పుట్టించు రణములు మొదలగు

దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి

— వివరములకు —

సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు
5/22, మేల్ మాయిల్, (P. O.) N. A. Dt.

## ఉత్తమ చికిత్స

ఏకారణముల చేతనైనా దాంపత్య సౌఖ్యం అనుభవించ లేని వారు వెంటనే 15 పైసల స్టాంపుతో మమ్ములను సంప్రదించండి :

డా. ఎ. పూర్ణచంద్రరావు,
N.D.F.N.F-U. (Ceylon) R.A.M.P.
సెక్సు స్పెషలిస్టు,
పూర్ణాపిక్చర్సువద్ద, గాంధినగరం, విజయవాడ3

## సలహా

కోల్పోయిన ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది. నరాల బలంకు పైపూతకు వాడే తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు. 27/- ఎడ్రెస్సు పంపుతూ జవాబుకు కవరు పంపాలి.

డాక్టర్ రత్నం సన్స్,
Sex Specialists (Estd 1904)
అజంపురామార్కెట్ వద్ద, మలకపేట బిల్డింగ్స్
హైద్రాబాద్-24 (ఆంధ్ర ప్రదేశ్)

ఉచితము : ఉచితము ::

## తెల్లమచ్చలు

మా ప్రఖ్యాతిచెందిన 'డాగ్ సాఫ్' ప్రత్యేక ఔషధము తెల్లమచ్చలను సులభముగ పోగొట్టుటలో 1925 సం॥ నుండి ప్రఖ్యాతి వహించి యున్నది. మూడురోజులు వాడినంతనే మచ్చలు తెలుపుదనం ఆపైన కొన్ని రోజులలోనే పూర్తిగా బాగుచేయు శక్తిగలదు. ఉచితంగ ఒక పాకెట్ మందుఇవ్వబడును నకలుచూచి మోసపోకండి.

Ashoka Treatment Centre,
P. O. Katri Sarai (Gaya)

## తెల్ల వెంట్రుకలను పోగొట్టును

వెంట్రుకలకు రంగుకాదు. ఆయుర్వేదము ప్రకారము అనేక భారతీయ మూలికలచే తయారుచేయబడిన "శ్యామ్ కాంతి" తెల్ల వెంట్రుకలను శాశ్వతముగ వాటి సాధారణ నలుపురంగునకు మార్చుటలో అసాధారణ శక్తి కలిగియున్నది. వెల: రూ. 10/-

Shyam Ayurved Bhawan,
No. 114, P O KatriSarai(Gaya)

మతవాదులు
నాకు మీరెవరూ నచ్చలేదు
చీలికలు
సోషలిస్టులు
చీలికలు
కమ్యూనిస్టులు
చీలికలు
అంతర్ విభేదాలు
ఓటరు
కాంగ్రెస్
కేరళలో పార్టీలు
అధికారులచే డబ్బు దుర్వినియోగం: అదుపులోలేని ఫలితాలు
మన ఆర్థిక స్థితి


దీన్ని ఎందుకు అణచరు?
నేనా? ఎలా?
కమ్యూనిస్టు వామ పక్షం విరుద్ధంగా సాక్ష్యాలు
వామపక్షం
రహస్య మంత్రాంగాలు


చైనా నుంచి వడ్డీ లేకుండా ఋణాలు

అమ్మా, నేనే చెప్పేను కదుటే. ఆ పేపరు వాళ్ళకి డబ్బు పారేస్తే చాలు. ఎంచక్కా వేసేరో ఎడ్వర్టయిజుమెంటు" అంటూ ఇంట్లోకి పరుగెత్తింది తార.

అప్పుడే పూజకి అన్నీ సిద్ధం చేసుకొని ఆచమనం చేసుకుంటూంది, తల్లి. పేపరు మాట వినగానే పూజ మాట మరచిపోయి ఎంత లావు మనిషి అయినా సునాయాసంగా ఇటు తిరిగి "వేసేడూ ? ఏం వేసేడు ? వెయ్యకేం జేస్తాడులే డబ్బు పడ్డాక ? ఏం—వూరకనే వేస్తే ఏం పోయిందో ? వాడి పేపరుకే పేరు వస్తుందిగా మంచి పెళ్ళికొడుకుల ఎడ్రస్సులు నలుగురికీ తెలియజేస్తే" అని చిన్న పురాణం మొదలెట్టి, కళ్ళజోడు తగిలించుకొని 'ఇంతకీ ఏం వేశాడు ?" అని ఆత్రుతగా దీర్ఘం తీసింది.

ఇదుగో. నేను రాసినట్టుగానే.

"వధువు కావాలి. వరుడు అందగాడు. చురుకైనవాడు. వయస్సు 18 సం. లే అయినా మెట్రిక్ ప్యాసు అయ్యేడు. తినలేని తరగలేని ఆస్తి. వధువు చక్కగా ఉండాలి. జాతకాలతో పనిలేదు. లక్ష్మీ కళ ఉంటే చాలు. చిరునామా . . . ."

అని గబాగబా కాఫీ త్రాగినట్టు చదివేసింది తార. వారపత్రికలో ఎడ్వర్టయిజుమెంటుని—తమ్ముడి పెళ్ళి గురించి.

"అయితే, అమ్మాయీ, ఇలా పేపర్లో వేయించుకుంటే మంచి సంబంధా లేవైనా వస్తాయంటావా? లేక చెల్లని నయాపైసా కాబట్టి పేపరు వరకూ ఎక్కిందిరా అని చులకన చేస్తారా ?" అని చిన్న సందేహాన్ని వెలిబుచ్చింది తల్లి.

"అదేంటమ్మా, అలా అంటావు ? ఎంత డబ్బున్నవాళ్ళు కాకపోతే మగపిల్లాడి పెళ్ళికి పేపర్లో వేయవలసిన అగత్యం వాళ్ళకే ముంటుందీ ? మంచి ఆస్తిగల సంబంధాలు కావాలని వేసుకున్నారు" అని అనుకుంటారుగదుటే.

"ఏమోనమ్మా. ముసలిదాన్ని. వాడికి తండ్రి లేడు. తండ్రి అయినా, తోడు అయినా నువ్వే. వాణ్ణో ఇంటివాణ్ణి చేసి నా కళ్ళ పెడితివా సంతోషిస్తాను. లేదా ...." అంటూ కళ్ళు చెమ్మగిల్లుతూ ఉంటే దేముడివైపు తిరిగింది. కళ్ళజోడు విప్పి, కళ్ళు పంచె కొంగుతో తుడుచుకుంటూ.

"మరి కట్నంమాట వేసేవుకాదేం ?" అని అడిగింది—తనకు రావలసిన లాంఛనాలు తగ్గిపోతాయేమో నన్నట్టు.

"రాసినదాంట్లో ఆ అర్థం ఉందే" అని ధైర్యం చెప్పింది తార ఎడ్వర్టయిజుమెంటుని మళ్ళీ మళ్ళీ చదువుకుంటూ.

"అమ్మా, ఇవాళ లేచినవేళ బాగుందే." అంటూ లోన ప్రవేశించాడు బాబు. వైజాగ్‌లో పి. యు. సి కి సీటు వచ్చిందే. నెలాఖరులోగా జీతంకట్టి, 7 వ తారీఖులోపల జాయిను కావాలన్నారు. ఏడుకొండలవాడా ! నీ దయ" అంటూ మనస్ఫూర్తిగా సాష్టాంగం చేశాడు.

"చూశావా, నే చెప్పేను కదుటే—ఆ వైస్ ప్రిన్సిపాల్ గారికి మామిడిపళ్ళు పంపమని. నువ్వు ఇష్టార్తికొద్దీ చిన్న బుట్ట పంపేవు—చాలక నాబోలు తిరిగి తోలేసేరు. కాని ఆయన పని గట్టివాడే. పిల్లదగ్గర లాటట్టుకోవచ్చుని. మా ఆయన లేవ క్షయంట్లని ఇలాగే పనిగట్టేవారు." అని ఈ సీటు రావడం తన ప్రజ్ఞే అని విశదీకరించింది కూతురు.

"అక్కా, ఆయన దేముడిలాంటి మనిషిటే. అందరూ అలానే అంటున్నారే. నువ్వు పంపిన కుళ్ళు మామిడిపళ్ళకి మురిసిపోయే డంటావా ?"

"త్రిప్పి పంపేశాడు కదురా ?" అంది తల్లి అమాయకంగా.

"ఒరే, నీకు తెలియదురా. పైకి మంచిగా కనబడకపోతే ఎవ్వరైనా దగ్గర చేరతారా ?" అంది అక్కగారు.

"నీకు అందరిమీద అపనమ్మకమే."

"లోక సహజాన్ని చూస్తున్నానుగా."

"నీ మొహంరే లోకం కూడానా ?"

"అందరూ అంతే. డబ్బు చూస్తే నీరయి పోవలసిందే."

"నీ ప్లీడరు బుద్ధి. ఆయన పోయినా, నీలో వేసిన అంటు పోలేదు."

"చూసేవే— ఆయన్నీ నన్నూ ఎలాదులిపేస్తున్నాడో" కళ్ళంట నీళ్ళ చుక్కలు.

"అక్కయ్య నలా చెప్పకూడదురా. అది చెప్పినట్టు వినుకోవాలి. నీ బాగోగులు చూస్తోందా మరి?"

"కాదే. శుభంగా సీటువస్తే, దేముడికి దండం అనో, ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు కొడతాననో అనాలికాని, వైస్‌ప్రిన్సిపాల్‌కి మామిడి పళ్ళు పంపుతేసరి. ప్రిన్సిపాల్‌కి పాలకోవా పంపుతే సరి అని నిందలు వేయడం బాగుందా?"

"లోకం పోకడ తెలుసు కాబట్టి అంది. అయినా విన్ననలేదుగా,"

"అనవసరమైన నిందలెందుకూ అంట." తల్లి చూపే సానుభూతికి, తమ్ముడి ఆగ్రహానికి ఫలితం—తార కళ్ళంబట నీళ్ళధార. ముఖం చీర కొంగులో దాగుండి పోయింది.

"పొద్దున్నే, నీ పెళ్ళి కబుర్లతో ఎంత పొంగి పోయిందో వెర్రితల్లి. దాన్ని ఒక్కలా ఏడిపిస్తున్నావు. పో, అవతలకి." అని కసిరింది తల్లి. మాట్లాడలేక వెళ్ళి పోయేడు బాబు.

* * *

మూడు నెలలు గడిచేయి. తీరికగా తల్లీ కూతురు జరిగిన దాన్ని స్మరించుకుంటున్నారు. మూడు సంబంధాలు వచ్చేయి. బాగానే ఉన్నాయి. పిల్లలూ బాగానే ఉన్నారు. అందులోనూ రేపల్లె సంబంధం మరీ బాగుంది. పిల్ల బొమ్మలా తీర్చి దిద్దినట్టుగా ఉంది. చక్కని పసినిమ్మ పండు రంగు. ముట్టుకుంటే కంది పోతుందేమో అన్నట్టుంది. నిజానికి ఆపిల్ల దగ్గర బాబే తీసిపోతాడను కున్నారు. వాళ్ళింట కూడా పిల్లకి ఒక్క అన్నగారు, తల్లితండ్రీ మినహా ఎవ్వరూలేరు. సాంప్రదాయం బాగుంది. పిల్ల తండ్రి బ్యాంకులో ఏకౌంటెంటుగా చేస్తున్నాడు. బాబు తండ్రి మాత్రం ఏం చేశాడు? ఇరవై ఏళ్ళ ఓ కంట్రాక్టరు దగ్గర పనిచేసి ఆఖరు దశలో కాంట్రాక్టులు పుచ్చుకునేవాడు. పిల్లకి సంగీతం కూడా వచ్చు. సంబంధమే ఖాయమైతే రోజూ కోడలి చేత రామదాసు కీర్తనలు పాడించుకో వచ్చునని తలో పతే మురిసి పోయింది తల్లి.

"అయినా పాతిక వేలకే ఎలా ఒప్పేసుకుంటావో?" అని పేచీ లేవతీసింది తార.

"డబ్బులో ఏముందే—పిల్ల బాగుంటేను?"

"భలే దానివే. బంగారం లాంటి బాబుని పాతిక వేలకే చెల్లు పెట్టేస్తానా? ముష్టిపాతిక."

"వాళ్ళూ ఏదో ఇస్తామన్నారుగా"

"ఊరకనే ఇస్తారా?"

"ఊరకనే ఎందుకిస్తారు? సంబంధం మంచిదని ముందుకొచ్చేరు."

"అదేనమ్మా నేనూ అంట. సంబంధం మంచిదని నలుగురికీ తెలుస్తే వాళ్ళలో వాళ్ళకి కాంపిటీషన్ మీద ధర పెరుగుతుందే"

"డబ్బు మనవాడార్జించుకోలేడే? మీనాన్న చూడు. వెయ్యి రూపాయిలు మదుపుతో మొదలెట్టి ఆ రామచంద్రమూర్తి సహాయంతో 'ల' కారం దాటించేరా?"

"బాగానే చెప్పేవు! మనవాడు చేతకాని వాడనా! చేతనైనవాడు కాబట్టే బిగించడం. ఇదే దద్దమ్మ అయితే వేరే మాట."

"మనడబ్బు వాడికి చాలదుటే."

"చాలదనా? నాన్న వ్యాపారానికి వెయ్యి ఎక్కడ్నుంచి ఒచ్చేయి? మీవాళ్ళిచ్చిన బాపతేనా? అలాగే—ఇప్పుడో ల కారమైనా ముడితే బాబు దాన్నో పది చేసుకుంటాడు. పదికాలాలపాటు సుఖపడొచ్చు."

"ఏమో, నీయిష్టం. నామట్టుకు ఆ రేపల్లె సంబంధం నచ్చింది. ఇంకా మంచి సంబంధాలు వస్తాయంటావు—నువ్వేచూడు"అని నిట్టూర్చింది తల్లి.

"నీకెందుకమ్మా, నే ఉన్నానుగా. ఆభారం నా మీద ఒదిలిపెట్టు"

"డబ్బు సంగతెలా ఉన్నా, నాకు మాత్రం చక్కటి పిల్ల కావాలి. బాబు అదీ ఇంట్లో మెసలుతూ ఉంటే పండుగలా ఉండాలి. నే కోరేదంతే."

"నే చెప్తున్నాకదూ. రత్నంలాంటి పిల్లని తెచ్చి బాబుకి పెళ్ళి చేస్తాను. కావిళ్ళతో కానుకలు తెప్పిస్తాను. నువ్వు ఎత్తిన కాలు దించక్కర్లేకుండా చూస్తాను. చాలా?"

"ఏమో, సరేలే. ఇంతకీ రామ నిర్ణయం?... రామా, రామా.." అంటూ చాగోరింది.

తార తన పెద్ద కూతురు. పెద్దదేమిటి—ఒక్కతే. అది పుట్టిన పదిరోజులకే పెద్ద కాంట్రాక్టు వచ్చిందని, రోజులు బాగుంటాయని చిహ్నంగా 'తార' అని పేరు పెట్టాలన్నారు ఆయన. అలాగే రోజులు బాగుంటూ వచ్చేయి. తారకి పదేళ్ళయ్యేసరికి నాన్నకి మిలటరీ కాంట్రాక్టులందుకున్నాయి. కానీ, పరకా చేసుకున్నాడు. మరి పదేళ్ళకి తారని ఓ లాయరు చేతులో పెట్టేడు—పాతికవేలు లాంచనాలతో సహా ఇచ్చి. తార ఏడేళ్ళ పాటు కాపరం చేసింది. దివ్యంగా వెలిగింది. భర్త కుటుంబరావు ఉత్త సత్తగుల్ల. భార్య దగ్గరకూడా భయమే. అసలే తారకి నోరు పెద్దది. చెప్పు చేతల్లో ఉండేవాడు. ఆయన వింటున్న కొద్దీ మరీ నొక్కడం మొదలు పెట్టింది తార. ఇంటి ఖర్చంతా తన చేతులమీద నడవవలసిందే. నెల జీతానికి మాత్రం ఏభై రూపాయలు అడక్కుండా

ఇచ్చేది. స్నేహితుల కెవరికైనా కాఫీ ఇవ్వాలంటే అందులో మిగిల్చి ఇచ్చుకోవలసిందే. క్రమేణ తన అధికారాన్ని పెంచుకోడం మొదలెట్టింది తార. ఇద్దరు గుమాస్తాలా కేసులన్నీ తనకు చెప్పాలి. ఎక్కడ ఎంత పైకం పెలుతుందో, పేలాలో చెప్పాలి. తను కావాలనుకున్నంతా భర్త పుచ్చుకోవలసిందే. తక్కువయితే భర్త సమ్మాయిషీ ఇచ్చుకోవాలి. క్లబ్బుకి ఏ రోజు వెళ్ళాలో, ఏ రోజు మానాలో తన ఇష్టమే. తన స్వాతంత్ర్యంలోకి ఇంత చొరవ చేసుకోవడం కుటుంబరావుకి నచ్చలేదు. చాలా సార్లు చెప్పి చూసేడు. డబ్బు కావాలంటే అంతా తీసుకోమన్నాడు. కాని మగాళ్ళవ్యవహారాలలోకి రావద్దన్నాడు. బ్రతిమాలి చెప్పేడు గాని లాభం లేక పోయింది. తారది రాజకీవి. తలవంచడ మన్నది చేతకాదు. కాలుకి తప్పితేమెడకి, మెడకి తప్పితే కాలుకి బంధం వేసేది. "పెళ్ళి అంటే చేసుకున్నారు గాని నామీద అభిమానం ఉంటేగా నేచెప్పిన మాటవినడానికి" అనేది. ఆవంతా లాభం లేక పోతే "మీకన్న నాకెవ్వరున్నారు? మీరు ఆరోగ్యంగా ఉండి ఐశ్వర్యంలో ఉండాలనేగా నా కోరిక" అని మొదలెట్టేది. అంతేకాని భర్త నేవిధంగా తను నొప్పిస్తున్నది ఆమెకు అవగాహన కాలేదు. తన మనస్సులో ఉన్నది జరిపించడమే తెలుసుకాని, ఎదుటివాళ్ళు ఏమనుకుంటున్నారో అనవసరం. దానికి తోడు పెళ్లై ఏడేళ్లైనా కడుపు పండలేదు. "నాకో పాప కావాలండీ" అని వేధించడం మొదలెట్టింది. డాక్టరుకు చూపిస్తానంటే వనికి రానని పంతం పట్టింది. ఎన్నోదేముళ్ళకి మొక్కుకుంది కాని ఏ దేముడూ కరుణించలేదు. ఫలితంగా భర్త మీద దెప్పులెక్కువయ్యాయి. "మీరూ మగాళ్ళేనా? ఊళ్లో మగాళ్ళయితే ఇంట్లోమగాళ్లాపెళ్లేదరు వని చేతనయినా పిల్లల్ని కనడం చేత కావద్దూ?" అని అందుకునేది. కుటుంబరావు పరిస్థితులకి లోనైపోయేడు. పెళ్లైన కొత్తలో మెత్తగా ఉండడం వల్లనే ఇప్పుడీవిడ ఇలా తయారైందను కున్నాడు. సంసారం, చదువు, సంగీతం, వేదాంతం ఏమైనా చెప్పి చూసేడు. కాని ప్రయత్నాలన్నీ బూడిద మీద పోసిన పన్నీరు. కొనకి ఆయనకు దక్కింది—బుడ్డీ. ఏ ముహూర్తాన్న మొదలు పెట్టేడో రాకెట్‌లా స్పీడు అందుకున్నాడు.

# వధువు కావాలి

బుడ్డి అలవాటు రోజుకి రోజుకి పెరిగింది. మూడేళ్ళలో తననే ముంచేసింది—తారమ్మ కుంకం బొట్టు చెరిపేసింది. మాటు మణిగిన తారని చూసి సంవత్సరం తిరక్కుండా తండ్రి కళ్ళు మూసేడు—తన జీవితంలోని తారే రాలిపోయిం దన్న వ్యాధితో.

కష్టాలన్నీ తల్లికళ్ళముందు స్క్రీను లేకుండానే సినిమాలాగ తిరిగేయి. కనుకొలకుల్లో నీళ్ళు చేరేయి. "చూడమ్మా. చిన్నపిల్లాడు. తండ్రీ, తోడూ నువ్వే" అని రెట్టించింది.

సంబంధాలు వస్తూనే ఉన్నాయి. కాని ఏదీ పాతికవేలకు మించడంలేదు. తారమ్మకి చిరాకు, నిస్పృహ కూడ వస్తున్నాయి. ముక్కోటి ఆంధ్రుల్లోనే ముచ్చటైన సంబంధాలే లేవా అనుకునేది—ముక్కోటి ఆంధ్రులూ పి.యు.సి.చదువు తున్న తమ్ముణ్ణి వెదుక్కుంటున్నట్టు. తమ్ముడు పి.యు.సి.ప్యాసయితే సంబంధాలు కలిసి వస్తా యనుకుంది. కాని తొలియేడు ఇంగ్లీషులో తప్పేడు. "ఇలా అయితే ఏం లాభం? పాడై పోతావు" అని తమ్ముడిని హెచ్చరించింది. ఎలాగైతేనేం రెండో మాటు పి.యు.సి. గట్టెక్కేడు బాబు. అంతేనా—విశాఖపట్టణం ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చింది. ఇంకేం—మరో నెల్లాళ్ళకి—పేపరులో

"వధువు కావాలి—విశాఖపట్నంలో ఇంజనీరింగు చదువుతూన్న స్ఫురద్రూపికి, ఆస్తిపరునికి. సరితూగే సంబంధం చక్కటిది సాంప్రదాయమైనది లక్ష్మీకళతో సహా. చిరునామా......"

పేపర్లో పడ్డ ఎడ్వర్టయిజమెంటు తల్లి వద్ద పదే పదే చదివింది. తన చేయబోతున్న నిర్వాకానికి తనే మురిసిపోయింది. తననెత్తిన ఉన్న బాధ్యత తను కాబట్టి మోస్తున్నట్టు గర్వించింది.

"ఏమిటోనండి, మాతమ్ముడి పెళ్ళి ఖాయపర్చే వరకు నాకు కునుకు పట్టదండీ" అని పక్కఇంటి వదినగారితో కనీసం రోజుకు ఒక సారయినా అనేది.

సంబంధాలు కుప్పలుగా వస్తున్నాయి. తారమ్మకి వాటిని పరీక్షించడమేపని. చదువు, చక్కదనం, సంస్కృతి, సాంప్రదాయం, కట్టు, కలుపుగోరుతనం ఎన్నని చూడాలి! పైగా తమ్ముడు ఇంజనీరుగామరి — పిల్లకి ఉత్త సంగీతం చాలదు. ఆటలేవైనా రావాలి, మాటకారి కావాలి. మళ్ళీ ఇంట్లో మెత్తగా ఉండాలి. వీధులో చదువుకున్న పిల్లలా కట్టూ కచ్చా ఉండాలి. ఇంట్లో గుట్టూ గుంభనా ఉండాలి. ఒకవేళ వాడు ఏ చీఫ్ ఇంజనీరో అయితే క్లబ్బులో ఉపన్యాసలిచ్చే ధైర్యం ఉండాలి. ఫారిన్ వెళ్ళవలసి వస్తే ఇంగ్లీషు బాగా రావాలి. దూరాభారాలకి బదిలీ అయితే ఒక్కతేరైలు ప్రయాణాలు చేయగలగాలి. అబ్బబ్బ—ఎన్ని పాయింట్లు చూసుకోవాలి. చూస్తున్న కొద్దీ తారమ్మ తల వేడెక్కి పోతుంది. ఈ ఇంజనీర్లు ఎంత మలాగ్గా తమ భార్యల్ని ఎంచుకుంటారో అని అప్పుడప్పుడు విస్తు పోయేది. ఏమైనా సరే తనూ తమ్ముడికి అన్యాయం చేయలేదు. బంగారం లాంటి సంబంధం చూసితీరుతుంది. తప్పదని కంకణం కట్టుకుంది.

వేసవి సెలవులకి తమ్ముడింటికి వచ్చేసరికి తారకి పని ఎక్కువయ్యేది. రోజులు గడుస్తున్న కొద్దీ ధరలు పెరిగి పోతాయని పెళ్ళి చూపులకి పిల్చే కన్యాదాతలు తల్లిపేరున తారమ్మకు కబుర్లు పంపేవారు. ఒద్దు, మొర్రో అన్నా, వచ్చిన సంబంధాల్ని, ఆడపిల్లల్ని చూడక తప్పేదికాదు బాబుకి. "ఈ పెళ్ళి నీక్కాక పోతే నాకురా? నువ్వు చూడకపోతే ఎలా ?" అని తమ్ముణ్ని పొడిచేది.

"చదువాపి పెళ్ళి చేసేసుకోమంటావా ?" అనేశాడు బాబు ఆఖరికి.

"చదువులేక పోతే మంచి సంబంధాలెలా వస్తాయి?"

"అయితే చదువుకోనియ్యి"

"ఈ లోపల మంచి సంబంధాలు మనకు తెలియకుండా చెయ్యిదాటిపోతే."

మాట్లాడలేక పోయేడు బాబు.

"చూడు బాబూ, చదువు చదువుకుంటూ ఉండాలి. పెళ్ళికి వలవేసి ఉంచాలి. అసలైన సంబంధం చిక్కిందా, అప్పుడే చదువుకి స్వస్తి చెప్పొచ్చు."

"అయితే చదువు దేనికంటావు?"

"దద్దమ్మా, చదువుకుంటూ నీకేతెలియదూ? కాబోయే అల్లుడు గొప్పవాడని చెప్పుకునేందుకు నాలుగు డిగ్రీలుంటే—మామగారు నాలుగు రాళ్ళు వదేస్తాడు."

"ఆ రాళ్ళు మనం ఆర్జించుకో కూడదా?"

"మామగారిస్తే మాత్రం వేరే మనం ఆర్జించుకోకూడదా?"

తార చిలిపిరి తనానికి జాలి వడ్డాడు బాబు. చేసేది లేక చిరునవ్వు ఒకటి పారేశాడు.

"తారక్కా, నీ బుర్ర భలే బుర్రే. ఇంగ్లీషులో "బ్రెయిన్సు" అంటారు" అన్నాడు. ఇన్నాళ్ళకి తన ప్రయాసంతా తమ్ముడర్థం చేసుకుంటున్నాడని భ్రమించింది.

"ఓరేయ్. ఇంకా చూద్దువుగానిరా— నిదానంగా ఆలోచిస్తే నాతడాఖా." అని ధీమాగా చెప్పింది. తమ్ముడు తనుచెప్పిన దారికి వచ్చేస్తున్నట్లే. తను చూడమన్న సంబంధం చూస్తున్నాడు. వద్దంటే మానేస్తున్నాడు.

నాలుగేళ్ళు ఇలాంటి తర్జన భర్జనలతో, ఫలితశూన్యమైన చూపులతో గడిచిపోయేయి. మిగిలిన

ఇటు మా ఆవిడ, అటు మన పెర్సనల్ సెక్రటరీ ఫోటోలు పెట్టుకుంటే ఫైల్సన్నీ పది నిముషాలలో తెమిలి పోయాయనుకో!

సత్యమూర్తి



SH82/NGB-81 TE

# ఎంతకాలంగా సేవింగ్స్ అకౌంట్ ప్రారంభిద్దామని అనుకుంటున్నారు?

ఇంకా ఆగడం ఎందుకు? నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో సేవింగ్స్ అకౌంట్ ప్రారంభించడం అతి తేలిక. అంతేకాదు చాలా త్వరగా తెములుతుందికూడా. ఖాతా ప్రారంభించడానికి మీకు కావలసిందల్లా రు. 5/-లు.... అదీ చేసుకోవాలన్న పట్టుదల మాత్రమే.

వాతావరణం ప్రోత్సాహకరంగా వుంటుంది....బ్యాంకి సర్వీసు సదా సహాయకరం.

కనుక వెంటనే మీ సమీపంలో గల నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంకి బ్రాంచికి వెళ్లండి. మా బ్యాంకిలో మీరు పెట్టుకొనే సేవింగ్స్ అకౌంట్ నిజమైన స్నేహితునివలె మీకెలా సహాయకారికాగలదో చూడండి.

**మీరుకట్టేడిపాజిట్ ఎంతచిన్నమొత్తమైనాసరే, నేషనల్ & గ్రిండ్లేస్ మిమ్మ పెద్దతహారగాచూస్తుంది.**



## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం)

బ్రాంచిలు: మద్రాసు: 3, నార్త్ బీచ్‌రోడ్; 378, నేతాజి సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.

అసోసియేటెడ్ బ్యాంకులు: లాయిడ్స్ బ్యాంక్ లిమిటెడ్ • నేషనల్ ప్రొవిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్

ఇల్లా తారమ్మ ఆడపిల్లల వాళ్ళని పెట్టిన రోత. ప్రతి సంబంధానికి తనూ వెళ్ళేది— వెనక అండగా తమ్ముడికి. పెరటింట్లో కాబోయే మరదలిని గంటకి తక్కువలేకుండా ఇంటర్వ్యూ చేసేది. అడ్డమైన ప్రశ్నలు వేసేది. సంగీతం వచ్చు నంటే, వెస్టర్న్ మ్యూజిక్ వచ్చునా అనేది. కుట్లు వచ్చునంటే క్రాస్‌స్టిచ్ వచ్చునా అనేది. అల్లిక వచ్చునంటే పులెన్సు అల్లగలవా అనేది. వంట వచ్చునంటే ఇంగ్లీషు డిషెస్ వచ్చునా అనేది. "పుస్తకాలు చదివి వండుతావా?" అని అడిగేది— అవునంటే "అయ్యో! ఆ మాత్రం కూడా రాదా?" అని పెదవి విరిచేది. "అక్కర్లేదు. మనవంటలు వచ్చునంటే"— "బాగుంది. పుస్తకాలు చూసి కొత్తవంటలు నేర్చుకోపోతే ఎలా?" అనేది. "షికారు కెళతావా— తమ్ముడితోనా?" అని అడిగేది. "అలాగే అయితేనిష్టం" అంటే "ఇలాగనే వాడిని పాడు చేస్తావు కాబోలు" అనేది. "ఆడపిల్లకి షికార్లెందు కమ్మా?" అని ఎవరైనా అంటే "సరిసరి. మా వాడు ఇంజనీరవుతాడు కదా. భార్య బయటికి రాదంటే నలుగురిలో తలెత్తుకో గలడా?" అనేది. "అమ్మని చూడ్డానికి పుట్టింటికి పదేపదే వెళ తావా అని అడిగేది. "అప్పుడప్పుడు ఆయన ఒప్పుకుంటేనా?" అంటే "ఇప్పట్నించే బేరం పెడు తున్నావా?" అనేది. "ఆయన్ని వదలి ఎలావెళ్ళ గలను?" అంటే "అలా అయితే మీ ఆరోగ్యాలు చెడిపోవూ?" అనేది. ఐ. ఎ. ఎస్ పరీక్షలా రుబ్బాడించి వదిలి పెట్టేది. ఎన్ని సంబంధాలు చూసిందో— కాని, అన్నిటికీ ఒక్కటే సమాధానం "ఇంటి కెళ్ళి జాతకం చూపించి జవాబు వ్రాస్తాం" అని. ఆ జాతకాలు ఎప్పటికీ సరిపోయేవి కాదు. దేముడు వరమిచ్చినా, పూజారి ఇవ్వొద్దూ?

సంబంధాల వాళ్ళకి సమాధానా లివ్వడానికి తారమ్మ చిన్న ఆఫీసు లాంటిది పెట్టుకుంది. సంబంధానికో ఫయిలు— (లాయరు గారి భార్యగామరి). రోజా టపా. వచ్చిన ఉత్తరానికి పదిరోజులలో జవాబు. జాతకాలు శాస్త్రుల్లుగారు చూస్తున్నారనో,

# వధువు కావాలి

శాస్త్రుల్లుగారి అబ్బాయికి ఒంట్లో బాగులేక ఇంకా చూడడం కాలేదనో— (ఇంకో శాస్త్రుల్లు గారెవరూ పనికి రానట్టు), అబ్బాయి జాతకం ప్రకారం ఆరునెల్ల వరకు పెళ్ళి ప్రయత్నం కూడదనో, మేమంతా నచ్చినా మా మేనమామకు నచ్చలేదనో (మేనమామ లేకపోయినా), ఇల్లా ఏవేవో డొంక తిరుగుడు కారణాలు చెప్పే సమాధానాలు. ఇంత హడావిడిలోనూ ఆవిడ కన్నల్లా ఒక్క పాయింటు మీదే ఉండేది — ఏమాత్రం ఇస్తామన్నారు? ఎంత వరకు ఇవ్వగలరు? ఆమె అనుకున్నట్టే ఏటేట ధర పెరిగింది. ఇంజనీరింగు నాలుగో ఏడు అవుతూందనే రోజుల్లో లకారం వరకు వెళుతూంది. వెంటనే ఒప్పుకొని పెళ్ళిచేసుకుంటే లక్ష కూడ ఇచ్చేస్తామని మైలవరంవాళ్ళు వచ్చేరు. కానివాళ్ళు ఏభై వేలకి మామిడి తోటలూ, పాతికవేలకి నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు, పాతిక వేలు నగదు ఇస్తామన్నారు. అందులోనూ తోటలూ సర్టిఫికేట్లు పిల్ల పేరునట. తారమ్మకి గిట్ట లేదు. లక్ష రొక్కం ఇచ్చి, ఆపైన పిల్లపేరున ఏం రాసుకున్నా తనకు రాజీయే.

కాని ఈమధ్యన వస్తున్నసంబంధాలేవీ తల్లికినచ్చడం లేదు. ఏసంగతులెలా ఉన్నా పిల్లలు తీరుగాఉన్నట్టు ఆవిడకి కనపడ్డంలేదు. బక్కపల్చగా ఉందనో, రంగు తక్కువనో, పలువరస బాగులేదనో, కళ్ళు చిన్నవనో కాళ్ళువంకరనో, నుదురు చిన్నదనో, జుత్తు తక్కువనో ఏదో లోపం కన్పించేది. పిల్లలకి అంత వయస్సు వచ్చిన వరకూ పెళ్ళికాకపోతే బెంగపెట్టుకొని ఇలా తయారవుతారని ఆవిడ నమ్మకం. ఏపిల్లా కూడా రేవల్లె సంబంధాన్ని పోలిలేదని రెండు మూడు సార్లు కూతురుతో అంది. కాని లాభం లేకపోయింది.

"అదేంటమ్మా, నేను లక్షలకి పరుగెడుతూ ఉంటే నువ్వింకా వేలలోనే ఉన్నావు? ఏం— ఆ మైలవరం పిల్లకేం తక్కువ? మనం ఒప్పు




కోవాలిగాని వాళ్ళు సిద్ధమే. అటు ఏలూరు వాళ్ళో— బంగారంలాంటిపిల్ల. మరో ఇరవైవేలకి వెనక తీస్తున్నారంతే. నువ్వూరుకో — తమ్ముడి పరీక్ష కానీ. నిక్షేపంలాంటి సంబంధం కూర్చేస్తాను" అని ధైర్యం చెప్పేది తార.

"ఏదో ఒక నిశ్చయానికి రాకూడదుటే?"

"నేనా? నాకేం? వాడు దేనికీ ఒప్పుకోవడం లేదు." అని తప్పించేది.

*　　　*　　　*

తమ్ముడు చదువుకోసం పాలుగేళ్ళు ఎంత కష్టపడ్డాడో, వాడిపెళ్ళికి అంత ప్రయాస పడ్డది తార. తమ్ముడి పరీక్షలై పోయేయి. మర్నాడు తెల్లారి ఉదయం ఎక్స్‌ప్రెస్‌లో తమ్ముడు వచ్చే స్తాడు. ఈ లోపున వ్రాయవలసిన జవాబులన్నీ రాసేయాలి. రెండుమూడు సంబంధాలు ఎంచి తమ్ముడికి చూపించాలి. ఇల్లు శుభ్రం చేయాలి. తార త్వరగా నడుంకట్టుకుంది. ఒక్క కప్పు కాఫీ తాగి పని మొదలెడదామనుకుంది. పోస్టు మేన్ ఆరు ఉత్తరాలు తెచ్చేడు. త్వరగా విప్పింది. ఒకటి ప్రీమియమ్ నోటీసు. రెండోది ఎలక్ట్రిక్ బిల్లు. మూడోది ఎలక్ట్రిక్ షాక్‌లాంటి ఉత్తరం. చదువుతూనే ఉత్తరాలకట్ట చేతో పట్టుకునే కూర్చో బడి పోయింది. రెండుమూడు మాట్లు కళ్ళు చీకట్లు కమ్మేయేమో కూడ ఆవిడకే తెలియదు. ఉత్తరమా, కలా అనుకుంది. ఇంత దారుణమా అనుకుంది. ఒళ్ళంతా ఒణికి పోయింది. నోరార్చుకు పోయింది. "తమ్ముడూ!" అని కేక పెట్టబోయింది, నోటంట మాట రాలేదు. తమ్ముడు కాదు, చండాలుడనుకుంది.

"తారక్కకి—నమస్సులు. క్షమాకాంక్ష.

ఈ ఉత్తరం చదువుతూ ఉంటే తారు తాగు తున్నట్టుంది. నువ్వు నిప్పులు తొక్కుతావని నాకు తెలుసు. కాని నేను కూడా మనిషినే బజార్లో అమ్ముడు పడడానికి నేనేం బెల్లం ముద్దకాదు. నాలోనూ రక్తం అంటూ ఉంది. ఆ మధ్య షికారుకి బీచికి వెళ్ళేను. దూరాన ఇద్దరమ్మా యిలు ఒకరినొకరు ఫోటోలు తీసుకుంటున్నారు.

ఇద్దరికీ కలిపి నేను తీస్తానన్నాను. సరేఅన్నారు. అందులో ఒక పిల్ల పేరు ప్రవీణ. వీణ అని అందరగా పిలుస్తారుట. అక్షరాలా వీణలా ఉంది. సముద్రం ఒడ్డున గులాబిరంగు చీరలో వీణ కూర్చొని వాల్జడ ముందుకు వేసుకుంటే, వీణ తంతుల్లా కురులు కదిలేయి. జడలో పువ్వులు మీటల్లా మెదిలేయి. గానతరంగాలు సముద్రపు కెరటాల హోరుని ముంచేసేయి. ఆ గానంలో నేను లీనమై పోయేను. మహా సరస్వతికే అలంకార మైన వీణ వద్ద నా మనస్సులోని మల్లెమొగ్గని అర్పించాను. ప్రవీణ నవ్వింది. మొగ్గ విరిసింది. తంతి మ్రోగింది. వీణ పాడింది నేను నాట్యం చేశాను. అంతా క్షణాల్లో జరిగింది. రెండోపిల్ల "మీకు మతి చలిస్తూందే" అనే వరకు మాకు తెలివిరాలేదు. తెలివొచ్చినా మా చూపులు ముడి పెట్టుకునే ఉన్నాయి.

నువ్వు మళ్ళీ ఇంకో ఎడ్వర్టయిజుమెంటు సిద్ధపరచవేమో. క్షమించి చించెయ్యి. వీలైనంత త్వరలో ముహూర్తం పెట్టించు—పెళ్ళికి కోడలు బాగుంటుంది. అమ్మకు నచ్చుతుందని అమ్మతో

చెప్పు. బంగారు పడకు. నేను సోమవారం ఉదయానికి వస్తాను. వీణ మూడు రోజుల్లో మనని చేరుకుంటుంది. ఆపైని మన ఇష్టం.

వీణ కుటుంబ పరిస్థితి....................... డబ్బు తక్కువ పిల్ల అని నిర్లక్ష్యం చేస్తే బాగుండదు.

క్షమిస్తున్నావు కదూ నన్ను?

ఇట్లు

.......................

కులభ్రష్టుడు! అని తిట్టుకుంటూ, చదవలేక అమ్మ దగ్గిర ఆ ఉత్తరం చదివింది. ఆ రోజల్లా తోకతొక్కిన త్రాచులా ఉంది. వీణ—వీణకాదు, బాణం, శూలం—ఇంటికి రాగానే ముక్కలుగా చెక్కి ఇంటికి పంపించాలి—పరువు, ప్రతిష్ఠ......... నిజం తెల్సుకోవాలి. కిట్టని వాళ్ళెవరైనా వ్రాసేరేమో అని సముదాయించింది తల్లి—కాని వ్యర్థం.

తెల్లవారింది. యుద్ధానికి సిద్ధమవుతోంది తారమ్మ. తమ్ముడు టాక్సీ దిగి సామానింట్లో పెట్టగానే తగులుకుంది—

"ఏంరా, ఆ ఉత్తరం నువ్వే వ్రాసేవా?"

"ఎందుకా అనుమానం?"

"అవునులే. అంత అఘాయిత్యానికి తలపెట్టిన వాడివి—ఈ ఉత్తరం వ్రాయడం నీకెంత?"

"నే చేసినది అఘాయిత్యమా?" అని నవ్వేడు బాబు.

"నీకేం—నవ్వుతావు. సిగ్గు విడిచిన పీనుగ. తండ్రి లేడు కదా అని నెత్తిన భారం వేసుకుంటే కొనకి తల గొరిగేవా?"

"ఆ భారం నీ కొద్దని నేచెప్పలే."

"ఆ కూతలు ముందే కుయ్యి లేక పోయేవు—ఆడదాన్ని చూడగానే అయిపయి పోయిన మొగాడివి."

"ఏం, నువ్వు డబ్బు చూస్తే అయిపయి పోవడంలే?"

"విశాఖపట్నం వెళ్ళి మాటలు నేర్చేవులే."

"లేక, నీలా ఓ మూల కూర్చొని నన్ను నేను మోసంచేసుకోనా?"

"ఈ కబుర్లు నీకు అదే నేర్పిందా—గొల్లకుంక"

"గొల్లకుంక కాదు గొల్లభామ. భామిని—నా మనోయామిని."

వాకిట్లో కొడుకు గొంతుక విని తల్లి ఇవతలికి వచ్చి

"ఏంరా బాబూ ఇంత మారి పోయేవు?" అని దీనంగా అడిగింది.

"లేదమ్మా, నేనేం చేసినా నువ్వు సంతోషించాలి" అని వంగి తల్లికి నమస్కరించేడు. "ముహూర్తం పెట్టిస్తున్నారా?"

"ముహూర్తం కాదు నా శ్రాద్ధం" అని అందుకుంది తార మళ్ళీ. "నువ్వు ఇలా ఘోరం చేస్తావనుకోలేదురా. నాపీక తీసేసేవురా. 'వధువు కావాలి' అని ఎన్ని ఎడ్వర్టయిజుమెంట్లు వేయించేను?"

తార భరించ లేకపోయింది. భోరున దుఃఖం వచ్చింది— తన చులకనకి. బావురుమని ఏడ్వాలనిపించింది. కాని కన్నీటి చినుకులతో కట్టేసింది.

వాకట్లో కారాగిన చప్పుడు. మెట్లు వరకూ పరుగెత్తాడు బాబు. "రా, వీణా, రా. నీ గురించే చెప్పుకుంటున్నాం" అన్నాడు.

తార, తల్లి విస్తుపోతున్నారు. కొయ్యలైపోయేరు. ఎవ్వరూ పలకరించలేదు. ఇదా వీణ అని చెప్పవాల్సకుండా నుంచున్నారు. బాబే మొదలెట్టాడు. "అమ్మకి దండం పెట్టు" అని.

తల్లి ఆశ్చర్యంతో—

మీది రేపల్లె కదమ్మా."

"అవునండి"

"మీ నాన్నగారు ఎకౌంటెంటు"

"ఆఁ—వెంకటేశ్వరరావు గారండి"

ఒళ్ళు మర్చి పోయింది తల్లి. తన్ను తను నమ్మలేక పోయింది. అమాంతంగా వీణని ఒళ్ళోకి తీసుకొని గట్టిగా కౌగిలించుకొంది. తొలి చూపుల విశేషమేమో. ఆ తల్లి చూపిన ప్రేమలో, వాత్సల్యంలో ఉక్కిరిబిక్కిరైంది వీణ.

"నీ మనస్సు నాకు తెలుసమ్మా" అన్నాడు బాబు.

"ఎలా చేసేవురా ఇదంతా!"

"ఏం. నీకు నచ్చిందన్నావుగా. ఆయేడే రేపల్లె వెళ్ళి వాళ్ళనాన్న గారితో అన్నీ ఖాయం చేసేను. కాని పిల్ల పల్లెటూళ్ళో పెరుగుతే లాభంలేదు. విశాఖపట్నం పంపించి యూనివర్సిటీలో చదివించమన్నాను. ఆయనే నాకూ ఇంజనీరింగులో సీటు తెప్పించారు. దాన్ని కాలేజీలో జాయిను చేసేరు. దాని బాధ్యతా నాదే. అలాగే నాలుగేళ్ళు గడిపేసేం. వీణకి నేను నచ్చకపోయినా, వాళ్ళ నాన్న బలవంతాన తప్పలేదు"

తల్లీ, కొడుకూ కోడలు ఘల్లున నవ్వేరు.

ఈ అముదం తాగలేక "ఈ ఏడుపు మొదటే ఏడవ రాదూ? నాకీ బాధా, అవస్థా తప్పేవే!" అంది తార.

"చూడక్కా. పెళ్లాడేవాణ్ణి నేను. పిల్ల నాకు కావాలి. డబ్బు నీకు కావాలి. మేం వైజాగ్ వెళ్ళిన ఏడాదే వీణ అన్న పోయేడు. కొడుకయినా, అల్లుడయినా నువ్వే అని వాళ్ల నాన్నగారు ఆస్తి అంతా వీణకి, నాకురాసేసేరు. వీణకి ఆస్తి, నాకురొక్కం."

"ఆఁ. ఏమాత్రం ఉంటుందిలే. ముష్టి పాతిక వేలతో మొదలెట్టేరు."

"అలాగా. ఇదుగో చూడు పాస్‌బుక్. లక్షన్నర దగ్గరగా ఉంది. చాలా?" తార గుడ్లు తేలేసింది. "నే చెప్పేను కదుటే వీడిలాంటి పనేదో చేస్తాడని. అన్నీ నా గుణాలే. నీకూ, నాకూ నచ్చిన సంబంధం తెచ్చేడు. బంగారంముద్ద. ముత్యాలమూట" అని బుగ్గలు నిమిరింది.

"ఇంకా అడగవేం. వచ్చేనెల ఇద్దరం జపాను వెళుతున్నాం. నాకో కంపెనీలో ట్రెయినింగ్‌కి ఏర్పాటుచేశారు వీళ్ళ నాన్న. సూదితో దారం వీణ."

"ఆఁ ఆఁ. నే అనుకున్నాలే. నువ్వెంతకైనా తగుదువని."

"సరేకాని, అక్కా, నువ్వింతమంది ఆడపిల్లల్ని అల్లరిపెట్టి అవస్థ పెట్టేవుకదా! ఇంక కలం వదిలి గరిట పట్టుకుంటే ఎంత బాగుంటుందే!"

అంతా నవ్వేరు.

"రా, అమ్మా ఒక్క రామదాసు కీర్తన పాడు" అని తల్లి వీణని కూర్చోపెట్టింది.

"ఇప్పుడు కాదు" అని తల్లి ఒళ్లో తలదాచుకుంది వీణ.

"ఆ ఒళ్లో కాదు. నా వొళ్లో పడాలి" అన్నాడు బాబు.

"మొండి ఘటమూ" అంది తార. ★

# అధిక ధరల సమస్య

ప్రస్తుతం మనమంతా అధిక ధరలతో ఎన్నో బాధలు పడుతున్నాం. ధరలు దినదిన ప్రవర్ధమానమై ఆకాశాన్నంటుతున్నాయి ఈ అధిక ధరలవలన ప్రజలలో విపరీతమైన అలజడి చెలరేగింది. రోజూ మనం వాడుకునే వస్తువులన్నీ అధిక ధరల్లోనే ఉన్నవి ముఖ్యంగా ఆహారధాన్యాలు, పంచదార, పాలు, గోధుమలు మొదలైనవన్నీ నిత్యావసర వస్తువులు. వీటిలో ఏది లేకపోయినా రోజు గడవడం చాల కష్టం. సాధారణ మానవులు వీటికి తట్టుకోలేక పోతున్నారు తగు జీతాలు తెచ్చుకుంటూ ఉండేవారికే ఇది ఎంతో కష్టమైనప్పుడు, తక్కువ జీతాలు తెచ్చుకుంటూ ఎక్కువ కుటుంబ బాధ్యతతో జీవితం గడిపేవారి సంగతి వేరే చెప్పనక్కరలేదు గదా !

ఈ అధిక ధరల నరికట్టాలంటే ముఖ్యంగా ఆహారధాన్యాల ఉత్పత్తి బాగా జరగాలి. ఉత్పత్తి లోపం జరుగకూడదు. ఆ ఉత్పత్తి అయినా సరుకులు అన్ని రాష్ట్రాలలోను సమంగా పంపిణీ చేయాలి.

అసలే మనమంతా అధిక పన్నులతో బాధ పడుతూవుంటే గోరుచుట్టుపై రోకటిపోటు అన్నట్లు మళ్ళీ ఈ అధిక ధరలు అధికధరల నరికట్టుటలో స్త్రీకి కూడ చాలవరకు బాధ్యత ఉందని చెప్పాలి. అసలు ఇలాంటి విషయాల్లో స్త్రీలే ముందంజ వేయాలి. ఇబ్బందిపడే ఇల్లాండ్రందరూ తలచుకుంటే ఇది తప్పక జయప్రద మౌతుంది. వస్తువులన్నీ ఇంత అధిక ధరల్లో ఉన్నా, సంసారాల్లో కొన్ని కొనక తప్పదు. తప్పదు కదా అని పూర్వంవలె చౌకగా కొన్నట్లుగానే వాడుకోగూడదు. బియ్యం, పప్పు, ఉప్పు మొదలైన వెచ్చాలన్నీ గృహిణికి నెల కొకసారే తెప్పించుకో డానికి వీలుకాకుండా ఉన్నది. భర్త ఆర్జనంతా ప్రతి నెలా వెచ్చాలకే సరిపోకుండా ఉంటుంది.

ఒకసారి ఢిల్లీలో పాల ధర పెరిగిందట. అక్కడ స్త్రీలందరూ తాము అనుకున్న ధరల కైతేనే కొంటాము. అధిక ధరలకు మేము కొనము అని నాలుగు రోజులు ఎవరూ పాలు కొనలేదట. వర్తకులు ఏం జేస్తారు నసేదిలేక ధరలు తగ్గించారట అలాగే ఇప్పుడు స్త్రీలంతా జట్టుగ కొన్నికొన్ని వస్తువులు ఒక వారం రోజులు కొనకుండా ఉంటే ఢిల్లీ సోదరీమణుల వలె—మనం కూడ విజయం సాధించగలుగుతాం. వారం రోజులు ఏ వస్తువు కొనకపోతే మాత్రం జరుగుతుంది ? లభొచ్చు. ఉదాహరణకు ఒక పది రోజులు పంచదార కొనడం మానేసి బెల్లంతో కాలం గడిపితే ఆ తరువాత మనకు కావలసినంత పంచదార దొరుకుతుంది. ఈవిధంగా చెయ్యాలంటే మనందరిలో ఒక రకమైన పట్టుదల కలగాలి ఎవరి స్వార్థం వారు చూచుకుంటూ కూర్చుంటే ఈ అధిక ధరలు విచ్చలవిడిగా తయారవుతాయి. పోనీలెద్దూ, ఒక నాలు రోజులు సాగిస్తే తరువాత ఎలాగో సర్దుకుపోతాం ఎక్కింటూనిడ సంగతి మనకెందుకు అనుకుంటె అధిక ధరలకు వర్తకులకు మనం దోహద మిస్తున్నట్లే.

ఆమధ్య ఈ అధికధరల గురించి స్త్రీలందరూ మీటింగు పెట్టుకున్నారట. ఆ మీటింగు దగ్గరకు వెళ్ళి వర్తకులు గోల చేశారట. తరువాత ఆ వర్తకులమీద ప్రభుత్వం తగు చర్య తీసుకుందనుకోండి. అది వేరే విషయం. ఇంతకీ నేను చెప్పొచ్చే దేమిటంటే ఇలాటివా టన్నిటికీ భయపడకుండ మనము ధైర్యంగా నిలబడగలగాలి.

ప్రస్తుతం చక్కెరకు కార్డుల పద్ధతి పెట్టారు. ఈ కార్డులంటే చాలమంది భయపడతారు. ఎందుకంటే కార్డుల ప్రకారం వారిచ్చే చక్కెర సరిపోదేమో నని. కార్డులలో ఇంటింటా మెంబర్స్‌ని నోట్ జేసుకోడానికి వచ్చే వారితో, ఉన్నవారికంటే ఇంకా ఇద్దరి ముగ్గురి ఎక్కువ మెంబర్సని చెపుతారు. ఇలా చేసి ఎక్కువ పంచదార నిల్వ చేసుకుంటున్నారు ఇలాంటి అవకతవక పనులు చేయకుండా ప్రభుత్వానికి మనమెంతో సహాయపడాలి.

కూరగాయల ధరలు కూడ విపరీతంగా పెరుగుతున్నాయనే చెప్పవచ్చు. ఈ కూరల విషయంలో మాత్రం పూర్తిగా బాధ్యత అంతా స్త్రీయే స్వీకరించాలి. మన ఇళ్ళలో ఎంతో కొంత పెరడు ఉంటుంది గదా ! అక్కడ కూరల పాదులు పెట్టుకోవచ్చు తక్కువ పెరడు ఉన్నవాళ్లు వారికి సరిపడే కాయించుకోవచ్చు. కొంచం పెద్దది ఉన్నవాళ్లు విరివిగా కాయించాలి. ఎక్కువ కాయించే వారినైనా పూరికే అందరికీ పంచిపెట్టమనడం భావ్యం కాదేమో. అలా అని ఇంటింటా కూరగాయల దుకాణాలు తెరవ నక్కరలేదు. పూరికి ఒక మహిళాసంఘం ఉంటుంది గదా ! ఆ సంఘం ద్వారా వీలుగా ఉంటేటట్టు అమ్మిస్తే మనకున్న దాంట్లో చాల సహాయకారిగా ఉంటాము. కాదంటారా ?

ఇప్పుడు పండుగ లున్నాయి. మనలో పండుగలు చాల ఎక్కువగా జరుపుకుంటాము. ప్రతి పండగకు అనేక రకాల పిండివంటలు చేసుకొని తృప్తిగా భోజనం చేస్తారు మరియు పనివారలకూ వారికి వద్దనే వరకూ పెట్టి తృప్తిచెందుతుంది గృహిణి. అలాటి గృహిణిని మరి అవన్నీ చెయ్యడం మానమంటె బాధగానే ఉంటుంది. కాని, ఏం జేస్తాం. తప్పదు మారుతున్నాం. ఇంకా మారాలి ఈ పొదుపు విషయంలో.

కుమారి కోగంటి విజయలక్ష్మి (ఐడివాడ)

## వివాహాలు-స్వేచ్ఛ

మయూరాక్షిగారు వ్రాసిన "వివాహాలు—స్వేచ్ఛ" వ్రాసేటప్పుడు పూర్తిగా మన దేశ పరిసరాలు, కట్టుబాట్లు పూర్తిగా విస్మరించారు స్వేచ్ఛ ఉండటమైతే అవసరమే కానీ, దానికి పరిమితి పెట్టారు మనవాళ్ళు, కారణ మేమంటారు. స్త్రీ విద్య, వివాహం పాశ్చాత్య పద్ధతిలో మన దేశంలో ప్రవేశపెడితే బాగుంటుం దన్నారు. విదేశాలలో స్వేచ్ఛ ఉంది. వాళ్ళలో ఎలాంటి లోటుపాట్లు జరిగినా విడాకులు. మళ్ళీ వివాహం. ఈవిధంగా ఎన్నో చేసే అవకాశాలున్నాయి.

రచయిత్రిగారు డిగ్రీలు పెళ్లిచూపులకే పనికి వస్తున్నా యన్నారు. ఇష్టప్రకారం వివాహం చేసుకొంటేనే డిగ్రీకి విలువ ఉన్నట్లు వ్రాశారు కానీ, అలా దిగజారిపోటం మన వ్యక్తిత్వానికే అవమానకరం. చదువు జ్ఞాన సంపాదనకి, దేశ పరిస్థితుల్ని అర్థంచేసుకొనేటందుకూ, అవసర సమయాలలో ఆర్థిక సంపాదనకు కాని, రచయిత్రి గారు వ్రాసినట్లు స్వేచ్ఛా వివాహాలకు కాదు. అదే చదువయితే అసలే వద్దు. లెల్లపల్లి బాల (మద్రాసు)




"కేవలం ఫ్రిజిడేర్కీ, ఓ రేడియోకీ, మామూలు లాంఛనాలకీ నాలాంటి అల్లాటప్పాని గనుక నిన్ను ఒప్పుకున్నాను"

# అటుకులతో రకాలు

## అటుకుల పులిహోర

కావలసిన పదార్థములు:—
అరసోల అటుకులు
నిమ్మకాయంత చింతపండు
రెండు ఎండు మిరపకాయలు
రెండు పచ్చి మిరపకాయలు
1 టీ స్పూను ఆవాలు, మినపప్పు, జీలకర్ర కరివేపాకు, కొద్దిగ ఇంగువ.

స్టీలు గిన్నెల్లో నీళ్లుపోసి చింతపండు నానబెట్టి పిసికి, గింజలు లేకుండ తీసి చింతపండు రసములో అటుకులు వేసి తడిపి పెట్టాలి. మిరపకాయలు అన్నీ వేసి పోపు చేసుకుని, కొద్దిగా మెత్తటి ఉప్పు, పోపు తడిపి ఉంచిన అటుకులతో వేసి కలియబెట్టి పది నిమిషముల తరువాత తింటే రుచిగా ఉంటాయి.

## అటుకుల మొరమొరాలు

అరసోల అటుకులు,
1 టీ స్పూను మెత్తటి ఉప్పు
½ చిప్ప ఎండు కొబ్బెర

అటుకులకు ఒక టీస్పూను ఉప్పు, రెండు టీస్పూనులు మంచినూనెవేసి కలిపి పెట్టుకోవాలి. బూర్లు మూకుడులో కొద్ది కొద్దిగావేసి వేయిస్తే మొరమొరాలుగా అవుతాయి. మాడిపోకుండా వేయించి తీయాలి. ఎండు కొబ్బెరను తరుగుకుని దోరగా వేయించి ఉంచుకోవాలి. గుప్పెడు వేయించిన సెనగపప్పు, కొద్దిగా జీడిపప్పు, వేరుసెనగకాయలు ఒలిచినవి గుప్పెడు ఇవన్నీ కలిపి ఆవాలు, మిరపకాయలు, కరివేపాకు పోపు చేసుకుని వేసి కలపాలి ఇష్టమున్నవారు పేలాల వడియాలు వేయించి వేసుకోవచ్చు ఇవి నెల రోజులయినా నిలువ ఉంటాయి.

## రోటి అటుకులు

అరసోల అటుకులు
ఆరు ఎండు మిరపకాయలు

ఆవాలు, ఇంగువ, జీలకర్ర, కరివేపాకు, శనగపప్పు, మినపప్పు అన్నీ కొద్దిగావేసి తాలింపుచేసి పెట్టుకోవాలి.

అర చిప్ప ఎండు కొబ్బరి
తగినంత ఉప్పు
నిమ్మకాయంత చింతపండు

కొబ్బరి మెత్తగా దంచి పెట్టుకోవాలి. అటుకులను మొరుముగా మండునట్లు దంచి చింతపండు, ఉప్పు, ఎండు మిరపకాయలు, పోపు ఇవన్నీవేసి కొద్దిగా దంచి తీసేయాలి. ఇవి తినటానికి రుచిగా ఉంటాయి. రెండు నెలల వరకు నిలువ ఉంటాయి.

## నిమ్మ అటుకులు

రెండు నిమ్మకాయలు
అరసోల అటుకులు
తగినంత పోపు సరకులు, మెత్తని ఉప్పు
రెండు ఎండు మిర్చి, రెండు పచ్చి మిర్చి.

ఒక స్టీలు గిన్నెలో రెండు నిమ్మకాయల రసముతీసి అటుకులు తడిపి పెట్టాలి. మిరపకాయలు, పచ్చిమిర్చి, తాలింపు సరుకులువేసి పోపు చేసుకుని ఉప్పు పోపుచేసి తడిపి ఉంచిన అటుకులను కలపాలి.

## అటుకుల ఉప్మా

అరసోల అటుకులు
1 సోల చిక్కటి మజ్జిగ

చిక్కటి మజ్జిగలో అటుకులు కలిపిపెట్టి మినపప్పు, రెండు పచ్చిమిర్చి, రెండు ఎండు మిర్చి, ఆవాలు, ఇంగువ, కరివేపాకు ఇవన్నీ బూర్లు మూకుడులో పోపుచేసి మజ్జిగలో నానబెట్టి ఉంచిన అటుకులకు తగినంత ఉప్పువేసి కలియబెట్టి అయిదు నిమిషాలు మగ్గనిచ్చి దించి స్టీలు గిన్నెలో తీసి పెట్టుకోవాలి.

## పెరుగు అటుకులు

అరసోల అటుకులు
అరసోల తియ్యటి పెరుగు
కొద్దిగా ఉప్పు
ఒక పచ్చి మిర్చి, రెండు ఎండు మిర్చి, జీలకర్ర, ఆవాలు, ఇంగువ, కరివేపాకు.

అయిదు నిమిషాలు ముందు పెరుగులో అటుకులను నానబెట్టి పై సామానులన్నీ పోపు చేసుకుని, కొంచెము అల్లము ముక్కలు, మెత్తటి ఉప్పు పోపువేసి కలిపి తింటే రుచిగా ఉంటాయి.

## మిరియపు అటుకులు

ఎనిమిది మిరియాలు
అరచిప్ప ఎండు కొబ్బెర
1 టీ స్పూను జీలకర్ర.
ఆవాలు, కరివేపాకు, ఇంగువ

మిరియాలు అన్నీ నేతిలో వేయించి మెత్తగా పొడిచేసి పెట్టుకోవాలి. కొబ్బెర కోరుకొని, అటుకులను మొరుముగా దంచి, చిన్న గ్లాసెడు నీళ్లు స్టీలు గిన్నెలోవేసి ఎసరు పెట్టాలి. నీళ్లు మరుగుతుండగా మిరియాల పొడి, ఎండు కొబ్బెరకోరుము, జీడిపప్పు వేసిన తరువాత అటుకుల రవ్వ, తగినంత ఉప్పువేసి కలియబెట్టి రెండు నిమిషముల తర్వాత క్రిందకు దించాలి.

## అటుకులతో మిక్చర్

1 పంపు మంచినూనె
1 టేబుల్ స్పూను కారం
1 టేబుల్ స్పూను మెత్తటి ఉప్పు
కొద్దిగ జీడిపప్పు
గుప్పెడు అటుకులు
గుప్పెడు వేయించిన సెనగపప్పు
కరివేపాకు

అటుకులు నూనెలో వేయించుకుని, ఉప్పు, కారంవేసి కలిపి ఉంచాలి. జీడిపప్పు, కరివేపాకు, సెనగపప్పు వేయించుకొని కారం కలిపిన అటుకులతో కలపాలి. ఒక వారంవరకు నిలువ ఉంటాయి.

## పంచదార అటుకులు

అరసోల అటుకులు
అటుకులకు కావలసినంత పంచదార
1 పంపు నెయ్యి
ఆరు ఏలక్కాయలు
కొద్దిగ జీడిపప్పు, ఎండు ద్రాక్షపళ్ళు,

అటుకులు నెయ్యిలో వేయించుకుని, ఏలక్కాయలు ఒలిచి పొడి చేసుకుని జీడిపప్పు, ద్రాక్షపళ్ళు, పంచదార వేసి కలపాలి. ఒకరోజు మాత్రమే నిలువ ఉండును.

## బెల్లపు అటుకులు

ఒక పచ్చికొబ్బరికాయ
అరసోల అటుకులు
అరసోల కోరుకొన్న బెల్లము

పచ్చికొబ్బరి కోరుకొని బెల్లము, అటుకులువేసి కలపాలి. కావలసినవారు పంచదారవేసి కలుపుకోవచ్చును.

## పాలటుకులు

అరసోల అటుకులు
ఒక సోల మంచిపాలు
తగినంత పంచదార

పాలు ఎర్రగా కాచిన తరువాత చల్లారనిచ్చి అటుకులు, పంచదార కావలసినవారు ఏలక్కాయలు పొడి చేసుకుని వేసుకోవచ్చు ఒక నిమిషము తరువాత తింటే బాగుంటాయి. నిలువ ఉండదు.

## అటుకుల లడ్డు

ఒక సోల అటుకులు
ఒక ఎండు కొబ్బరి చిప్ప
ఒక సోల పంచదార (లేక) బెల్లము

అటుకులకు నూనె, నెయ్యి ఏమీ వేయకుండా పొడిగా వేయించాలి. ఎండు కొబ్బెర కోరుకుని వేయించుకోవాలి. పంచదార (లేక) బెల్లము ముదురుపాకం పట్టి వేయించి ఉంచుకున్న అటుకులు, ఎండు కొబ్బెరవేసి కలిపి క్రిందకు దించుకుని చేతికి నెయ్యి రాసుకుని వేడిగా ఉన్నప్పుడే ఉండలు, ఉండలుగా పట్టుకొనవలెను. ఇవి రెండు నెలల వరకు నిలువ ఉంటాయి.

—టి. భూమాదేవి

# అపస్వరం



మూలం: త్రివేణి

అనువాదం: శర్వాణి

### జరిగిన కథ

తల్లిదండ్రుల్ని కోల్పోయి అనాథైన మీరను పెదనాన్న క్రిష్ణయ్యగారు చేరదీస్తారు. చదువులోనూ యితర విషయాల్లోను ఎంతో చురుకుగా ఉన్న మీరకు పెదతల్లి ఆటంకం ఎదురౌతూ ఉంటుంది. కొన్నేళ్లు గడుస్తాయి. మీర అన్న గోపి డాక్టర్ పూర్తి చేస్తాడు. మీర కూడా కాలేజిలో చేర్తుంది. తను కూడా డాక్టర్ చదవాలనుకుంటుంది. రాధ, గోపాలం దంపతులవుతారు. శాము, మీరలు పరస్పరం ఆకర్షించుకొంటారు. శాముతో మీర వివాహం జరిగిపోతుంది. మీర అత్తవారింటికి వెళుతుంది. కానీ లోలోపల డాక్టరవ్వాలనే కోరిక బలవత్తర మవుతుంటుంది. ఎత్తైటూరి వాతావరణం మీరకు గిట్టదు. అయినా, తన సంసారాన్ని దిద్దుకోవటమే తన కర్తవ్యమని మనసును సరిపెట్టుకునేందుకు ప్రయత్నిస్తుంది.

## 8

శామ వాదానికి ఏం బదులు చెప్పాలో అర్థం కాలేదు మీరకి. ఒక విధంగా శాము చెప్పిందీ నిజమే అనిపించింది. తను పుస్తకాలు చదివి ఏ పరీక్షలకు వెళ్ళాలి? చదవకపోతే మునిగిపోయిం దేమిటి? అన్ని వృథా అనిపించింది. ఒక్క క్షణం ఆమె మొహంలో ఓటమి తొంగిచూసింది.

శాము అక్కరతో ఆమె మొహంలోని మార్పులనే గమనిస్తున్నాడు.

"మీకు డబ్బు దండుగ అనిపిస్తే తెప్పించక్కర్లా" అని గబుక్కున వెనుదిరిగి వెళ్ళిపోబోయింది మీర. కాని ముందే జాగర్త పడిన శాము చటుక్కున ఆమె చెయ్యి పట్టుకొని తన దగ్గరకు లాక్కున్నాడు.

"నా దగ్గరనుండి ఎవరూ కోపంగా వెళ్ళిపోవడానికి వీలులేదు"

"నాకేం కోపంలేదు"

"అద్దం తెచ్చి పెట్టమంటావా?"

"ఉహూ. అక్కర్లేదు. వదలండి నన్ను. లేకపోతే అరుస్తాను." మీర విడిపించుకోవాలని పెనుగులాడింది. కాని శాము వదల్లేదు

"నాతో రాజీ పడితేగాని వదలను"

మీర కాస్సేపు ఊరుకుని "సరే నాకేం కోపం లేదు రాజీ పడ్డాను" అంది.

"మరి రాజీ పత్రానికి ముద్ర వేయొద్దూ?"

'ఛూ. వదలండి. నాకేం తెలీదు"

"నే చెప్తాగా" అంటూ శాము మీరను దగ్గరగా లాక్కుని పెదవులమీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

అతడు వదలగానే ఇంకా కోపం తగ్గని మీర తన అర చేతితో పెదవులను గట్టిగా తుడుచుకొని లోపలికి పారిపోయింది. అది చూసి శాము చిరునవ్వు నవ్వాడు.

* * *

నిండు పున్నమి. వెన్నెల వెదజల్లుతూ విహరిస్తున్నాడు, చందమామ. అలాటి సమయంలో మీర నిండుగా ముసుగు కప్పుకొని గదిలో పడుకుంది. శాము ఆరు బయట సంపంగి చెట్టు క్రింద కూర్చున్నాడు. ఇంత అందాన్ని ఆరాధించక తన కళ్ళు వ్యర్థం చేసుకొంటున్న మీరని లేపుదామని గదిలోకి వచ్చాడు.

"మీరా వెన్నెల ఎంత బావుందో చూద్దువు గానిరా."

మీర కదలలేదు. నిద్ర పోతున్నట్టు నటిస్తోంది. శాము ఆమె కప్పుకున్న దుప్పటి లాగి పారేశాడు.

"నాకంతా తెలుసుగాని, రాణీగారూ లేచి రండి!" అన్నాడు.

"నేను రాను"

"వెన్నెల ఎంత బావుందో వర్ణించలేను"

"వద్దు. మీరేం వర్ణించక్కర్లా."

"నీకు కళ్ళుండి వ్యర్థం"

"ఆలాగే. మీ కళ్ళు సార్థక పరచుకోండి చాలు"

"ఒక్కకన్నే చూస్తే, ఒక కన్నే సార్థక మవుతుంది. రెండో కంటి మాటేమిటి? నువ్వు నా అర్ధాంగివి కదూ?"

"నేను రాను గాక రాను. ఎన్నిసార్లు చెప్పాలి?"

"నువ్వు రానంటే అమాంతం నిన్ను మోసుకెళ్ళి కూర్చో బెట్టాల్సొస్తుంది" అని బెదరించాడు శాము అన్నంత పని చేస్తాడేమోనని భయపడి, లేచి కూర్చుంది మీర

"ఈ ఇంట్లో కాస్సేపు హాయిగా నిద్రపోదామన్నా వీల్లేదుకదా" అని గొణుక్కుంది

శాము గెల్చిన వాడిలా మొహంపెట్టి, మీరతో బయటికి వచ్చాడు. సంపెంగ చెట్టు క్రిందున్న రాతి బెంచి చివరిలో కూర్చుంది మీర.

"అంత దూరంగా కూర్చుంటే ఏం బావుంటుంది?"

"చంద్రుడిని చూడ్డానికి దగ్గరగా నే కూర్చోవాలన్న నియమ మేమీ లేదుగా?"

"కాని దగ్గరగా కూర్చోకపోతే చంద్రుడి అందం తగ్గిపోతుంది" అంటూ దగ్గరగావచ్చి ఆమె నడుము చుట్టూ చెయ్యి వేశాడు శాము.

మీర అతనిని నిరోధించే స్థితిలోలేదు. ప్రతి రోజూ ప్రతి నిముషమూ అతడు చెప్పినట్టు వినక తప్పేదికాదు అతడు మితిమీరి ప్రేమించటమే బాధాకరంగా ఉందామెకు.

"ఇప్పుడు చంద్రుని అందం ఇనుమడించింది"

మీర చంద్రునివేపే చూస్తోంది. ఆకసంలో ఆడుకుంటున్న చంద్రముడు ప్రపంచంమీద మత్తు మందు చల్లుతున్నాడు. ఎలాటి అరసికులనైనా కవులుగా మార్చే శక్తి గల వెన్నెల పరవశింప చేస్తోంది. అప్పుడే విచ్చుకుంటున్న సంపంగుల సువాసన గాలిలో తేలి వస్తోంది.

"మీరా నీకు ఇంకా కోపం పోలేదూ?"

మీర మౌనంగా కూర్చుంది. శాము మెల్లిగా తను దాచుకున్న మీర కోరిన అయిదు పుస్తకాలనూ తీసి ఆమె వడిలో పడేశాడు. మీర వాటిని చూడగానే 'నా కక్కర్లేదు' అంటూ దూరంగా నెట్టింది.

"మీరా, డబ్బు కర్చయిపోతుందేమోనని పుస్తకాలు కొనటానికి వెనుకాడుతున్నానని నువ్వు నిజంగా అనుకుంటున్నావా? నిన్ను సంతోషపరచ లేని డబ్బు నా కెందుకు? నా సర్వస్వమూ నీవే. నేను నీ వాడిని. నీ కోసమె శ్రమ పడాలి నేను. నా మీద కోపగించకు"

శాము కంఠంలోని దైన్యతకు కరగిపోయింది, మీర. దూరంగా నెట్టిన పుస్తకాలను తీసి వళ్ళో పెట్టుకుంది. శాము పుస్తకాల వేపు చూస్తూ "వాటికన్న తక్కువయ్యాను నేను" అన్నాడు.

మీర చిరునవ్వు నవ్వింది వెన్నెల నవ్వినట్టనిపించింది శాముకు

"మీర పుస్తక భాండాగారం దిన దినాభివృద్ధి చెందుతూ వచ్చింది. ఒకటి తరువాత ఒకటిగా నాలుగు బీరువాలనిండా పుస్తకాలు ప్రవేశించాయి. సుప్రసిద్ధ రచయితల పుస్తకాలన్నీ ఆమె బీరువాల్లో చోటు చేసుకున్నాయి. పుస్తక సేకరణతో బాటు కుట్టుపనీ ప్రారంభించింది. ఇంట్లో కిటికీలకు, తలుపులకు అందంగా కుట్ట బడిన తెరలతో అలంకరించింది. ఇంగ్లీషు వార పత్రికలను తెప్పించుకొని అందులోని మహిళా విభాగాలను చదివి, ఇంటిని అందంగా తీర్చిదిద్దింది. ఇంట్లోకి ప్రవేశించగానే కుడివేపునున్న గదిని, డ్రాయింగ్ రూముగా మార్చింది మీర. అందమయిన సోఫా సెట్టు తెప్పించి, అమర్చింది. గది మధ్యలో టీపాయిమీద, ఫ్లవర్‌వాజ్‌లోని పూలు కళకళలాడుతున్నాయి. చుట్టూ నాలుగు కుర్చీలు, కుర్చీలను, సోఫాలను అందంగా కుట్టిన కవర్లు అలంకరించాయి.

మీర చేతిలో కొత్త అందాలు తొడుక్కుంది ఇల్లు. రోజూ కాంపౌండంతా తిరిగి కొత్త పూలు అమర్చేది ఫ్లవర్‌వాజ్‌లో.

'పోస్ట్' అన్న కేక విని, ఆత్రుతతో బయటికి వచ్చింది, మీర. పెదనాన్న రాసిన ఉత్తరం అది. తన పేరనే ఉండటంవల్ల చించి చదివింది. ఏక కాలంలోనే సంతోష దుఃఖాలు ఆవరించాయి, ఆమెను. ఇంటర్‌మీడియట్‌లో ప్రథమశ్రేణిలో పాసయినట్టు తెలియపరచి, అభినందనలతో ముగించారు. తను పాసైనట్టు తెలిసి, సంతోషం కలిగినా, వెంటనే దుఃఖము పొంగి, చిన్న అలను వెనుకనే

# అపస్వరం

వచ్చిన పెద్దా తం విరగవేసినట్టు అది సంతో షాన్ని మింగివేసింది. మనసు చిన్నబోయింది సర్దు తున్న పూలు, అక్కడే పడవేసి, సోఫాలో వెనక్కి వాలిపోయింది.

కాలేజీలో తను గడిపిన రోజులు ఆమె కళ్ల ముందు మెదిలాయి. ఒక్క క్షణం కూడా వృధా పోనీయకుండా శ్రమించే తేనెటీగలా, తను గడిపిన రోజులను, ఇప్పటి నీరస వాతావరణంతో పోల్చు కుంది. కాలేజీ స్నేహితులు, చర్చల పోటీలు, ఆటలు, నాటకాలు, అన్నీ ఒక్కొక్కటే ఆమె ముందు నిలిచి వెక్కిరించాయి.

అయిదేళ్ల వయస్సులో కాన్వెంటులో చేరిన తను అప్పటినుంచి పదిహేడేళ్లదాకా (పెళ్లయ్యేదాకా) ఒక్క క్షణం విరామం లేకుండా గడిపింది. ప్రతి ఆటలోనూ పాల్గొనటం, బహుమతి పొందటం మామూలయిపోయింది, మీరకు. చిన్న పిల్లప్పటినుండి నాటకాల్లో వేయటమంటే ఎంతో ఉత్సాహం ఆమెకు. నాటకాల్లో నాయిక పాత్ర ధరించి, మొహానికి రంగు వేసుకొని, పెదవులకు రంగు పూసి, సహజ సౌందర్యాన్ని కృతకాలంకరణలతో మరింత పెంపొందించుకొని, స్నేహితుల ముందు నిలచి,

"ఎలా ఉన్నానర్రా ?" అని, వాళ్లచేత 'ఛార్మింగ్' 'కిల్లింగ్' అన్న పొగడ్తలు వింటూ, గ్రీన్‌రూమ్‌లో తిరుగుతున్న దృశ్యాన్ని తల్చుకుంది.

జూనియర్ ఇంటర్లో చదువుతున్నప్పుడు ఆఖర్లో నూర్జహాన్ నాటకం వేశారు. ఆరోజు అధ్యక్షత వహించినాయన మీర అభినయాన్ని, కళా కౌశల్యాన్ని మనసార పొగడి అభినందించారు మొఘల్ దుస్తుల్లో అసమాన్య రూపవతిగా కనిపి స్తున్న మీర అందరి దృష్టిని ఆకర్షించింది. తన సాటిలేని సౌందర్యంతో మొఘల్ బాదుషాను బాని సగా చేసుకున్న, చక్రవర్తిని, నూర్జహాన్ పాత్రకు జీవం పోసింది మీర. ఆఖర్లో బహుమతి అందుకోవ టానికి వెళ్లినప్పుడు అధ్యక్షులు

"అమ్మాయ్, కళామతల్లి నిన్ను వరించింది. అభినయం నీకు పుట్టుకతో అబ్బింది. దేవుడిచ్చిన ఈ వరాన్ని సార్థకపరచుకో" అని ఆశీర్వదించి బహు మతి నిచ్చారు.

అఖిల ఇంటర్ కాలేజి చర్చల పోటీల్లో పాల్గొని వేల సంఖ్యలో నున్న విద్యార్థి, విద్యార్థినుల ముందు ధైర్యంగా నిలబడి గంభీరంగా చర్చించి, బహుమతి పొందినప్పుడు అధ్యక్షుడు మీర వాద వైఖరిని ప్రశంసించి,

"నువ్వు 'లా' చదివితే మంచి ఫలిత ముండగల దని" సూచించారు కాని, నటి అవ్వాలని కాని, లాయర్ అవ్వాలని కాని లేదు మీరకు. లేత మనసు పాతుకుపోయిన ఆమె ఆకాంక్ష మళ్లీ ఏ కొత్త ఆశలకూ చోటివ్వకుండా మనసునంతా ఆక్రమించు కుంది. పెళ్లి నిశ్చయ మయినప్పుడే ఆమె ఆశ లన్నీ కూలిపోయాయి. పల్లెకు వచ్చినప్పటినుండి ప్రతిభావంతమయిన ఆమె మనసుకు మబ్బు పట్టి నట్టయింది. జీవిత మంటేనే జుగుప్స ఏర్పడింది. యుద్ధమే లేక, రణవీరుని కత్తి, రక్తదాహంతో తహతహలాడినట్టు ఉందామె స్థితి

పరీక్షాఫలితాలు తెలియగానే పాతస్మృతులు పొరేగి ఆమె హృదయంలోని ఆకాంక్ష పడగలు విప్పింది దుఃఖం పెల్లుబికి రాగా ఆ ఉత్తరాన్నలా చేతిలో ఉంచుకొనే వెక్కివెక్కి ఏడవసాగింది. "పెదనాన్న, శాము అందరూ తనకు పరాయివాళ్లే. తను బ్రతికి ఉండి ఏం లాభం ?" అనిపించింది.

నౌకరు బోరడు, అమ్మగారు ఉత్తరం చదివి ఏడవటం చూసి కంగారుగా వెంకమ్మగారి దగ్గరికి పరుగెత్తి సంగతి చెప్పాడు.

"అమ్మగోరు ఉత్తరం సదివి యేడుస్తుండారు. ఏం కబురొచ్చినాదో యేటో."

"అయ్యో, శామణ్ణ కూడా లేడే ఇంట్లో. వెంటనే వెళ్లి పిలుచుకురా. చెరుకుతోట దగ్గ రుంటాడు."

బోరడు పరిగెత్తుకుంటూ వెళ్లాడు. వెంకమ్మ గారు డ్రాయింగు రూము తలుపు దగ్గర నుంచొని:

"ఎక్కడినుండి వచ్చిందమ్మాయ్ ఉత్తరం ?"

మీర తలెత్తి చూసి "పెదనాన్న రాశాడు" అంది.

ఆమె మొహమంతా కన్నీరుతో తడిసిపోయింది. పెట్టుకున్న బొట్టు చెరిగి నీరు కారుతోంది చెది రినజుత్తు బుగ్గలకు అంటుకుంది.

"ఏడుస్తున్నా వెందుకమ్మా ? అందరూ కులా సాగా ఉన్నారుకదా ?"

"ఊఁ"

"శుక్రవారప్పూట కన్నీరు పెట్టకోరాదు, లే తల్లీ. లేచి మొహం కడుక్కుని బొట్టు పెట్టుకో. ఏం జరిగిందోనని శామణ్ణకు కబురు చేశాను."



మీర [illegible] లేచి కూర్చుని, "[illegible] కానా ?" అంది.

"వూ ! బోరడు వెళ్లా డప్పుడే."

"ఛ ! ఇక గాబరాపడుతూ వస్తా రాయన."

"నాకేం తెలుసమ్మాయ్. ఉత్తరం చదివి ఏడుస్తున్నావని చెబితే, ఏం జరిగిందోనని కబురు చేశాను."

మీర లేచి మొహం కడుక్కుని బొట్టు పెట్టు కుంటుండగా శాము పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ లోపలి కొచ్చాడు.

"మీరా .... ఏం జరిగింది ? ఎవరిది ఉత్తరం ?"

మీర విషాదంగా నవ్వి "ఏం లేదండీ" అంది.

"అమ్మగారు ఉత్తరం చూసి ఏడుస్తున్నారని చెబితే చేస్తున్న పని వదిలి వచ్చాను". అతని కంఠంలో విసుగు, కోపం ధ్వనించాయి.

మీర తల వొంచుకొని నిలబడింది.

"ఏది ఉత్తరం" అంటూ చుట్టూ చూశాడు. కన్నీటితో తడిసి నేలమీద పడిఉన్న ఉత్తరం అతని కంట పడింది. శాము అటు చూడగానే మీర ముందుకువచ్చి "అందులో ఏం లేదు." అంటూ ఉత్తరం తీసుకోబోయింది. శాము తన బలమయిన చేతులతో ఆమెను దూరంగా నిలబెట్టి ఉత్తరం తీసుకొని ఆత్రుతతో చదివాడు. చదువుతూన్న ట్లల్లా అతని కనుబొమలు ఆశ్చర్యంతో సంకు చితమై కళ్లు ప్రశ్నార్థకంగా ఆమెవేపు చూశాయి. ఏడుపుకు కారణ మేమిటన్న ప్రశ్న, అతని మొహ ములో గోచరించింది. మీర మాట్లాడకుండా మౌనంగా నుంచుంది.

"పరీక్షలో పాసైనందుకు అభినందనలు. కాని ఏడవదగిందేముందీ ఉత్తరంలో ?"

మీర మౌనం, శాము సహనాన్ని రెచ్చకొట్టింది.

"ఏడుపు కేమి కారణం ?" అన్నాడు గడుసుగా.

"ఏమిటో నాకు విసుగనిపించింది. దుఃఖ మొచ్చింది. ఏడ్చాను. అంతే."

శాము మరేమీ మాట్లాడకుండా ఉత్తరం క్రింద గిరవాటేసి, వచ్చినట్టే వెళ్లిపోయాడు.

శాము వెళ్లిపోయాక తన ప్రవర్తనకు సిగ్గు పడింది మీర. 'భోజనానికి వచ్చినప్పుడన్నా, ఆయన కోపం పోగొట్టాలి, ఎలాగా' అనుకోసాగింది.

మధ్యాహ్నం వెంకమ్మగారి చేత శాముకు చాలా ఇష్టమయిన, బర్ఫీ, బంగాళాదుంపల చిప్స్ చేయిం చింది. రెండు దాటినా శాము రాలేదు. మీరకు ఆక లొకవేపు, భర్త ఇంటికి రాలేదన్న చింత ఒకవేపు బాధించసాగింది. మాట్లాడకుండా వెళ్లి పడు కుంది. అలాగే నిద్ర పట్టేసింది.

మళ్లీ మెలకువ వచ్చేసరికి గంట నాలుగయింది. శాము ఇంకా ఇంటికి రాలేనేలేదు. గాబరాతో గేటు దగ్గర నుంచుని ఎదురుచూడ సాగింది. కాస్సేపటికి దూరంలో కాళ్లీడ్చుకుంటూ వస్తూన్న భర్త కనిపించాడు.

మీరని చూసి కూడా పలుకరించకుండా లోపలికి వడిచాడు శాము. మీర తనే పలుకరించింది.

"మధ్యాహ్నం భోజనానికి రాలేదేం ?"

"ఏమిటో విసుగనిపించింది, రాలేదు."

"చాలా ఆకలయ్యుంటుంది. ఇపుడయినా భోజ నానికి పదండి."

"నువ్వు భోంచేశావా ?"

"లేదు."

[illegible] కోపమంతా ఉదయం నుండి ఆమె భోజనం చేయ కుండా ఉందన్న సంగతి వినగానే కరిగిపోయింది.

"నువ్వెందుకు భోజనం చేయకుండా ఉండి పోయావు మీరా."

"ఇప్పుడేం మునిగిపోలేదు గాని, తొందరగా రండి. నా కాకలేస్తోంది." అంటూ లోపలికి వెళ్లింది. శాము ఆశ్చర్యంతో ఆమె వెళ్లిన వేపే చూస్తూ, "ఈ ఆడవారి మనసు, అర్థం చేసుకోలేం." అను కున్నాడు.

ఏకంగా భోజనమూ, టిఫిన్ పూర్తిచేసి వచ్చే సరికి సాయంత్రం అయిదయింది. శాము తమల పాకుల పళ్లెం ముందుంచుకుని కూర్చున్నాడు. మీర,

"అలా బయట తిరిగి వద్దామా ?" అంది.

"ఏమిటి. ఈరోజు అమ్మాయిగారికి చాలా హుషారు పుట్టుకొచ్చిందే ?"

"వస్తే వచ్చింది కాని, ఏ చీర కట్టుకో వాలో చెప్పండి."

టీచరు : వేడికి వస్తువులు వ్యాకోచం చెందుతాయి. చల్ల దనానికి సంకోచంపొందుతాయి. అనేదానికి ఓ ఉదాహరణ చెప్పరా రామూ.

రాము : ఎండాకాలం పగలు ఎక్కువగా ఉంటుంది. శీతా కాలంలో తక్కువైపోతుంది. అందుకే సార్ !

జి. ఎల్. కాంతారావు (గుంటూరు)

"నిశ్చితార్థంరోజున తెచ్చావే ఆ చీర.... "

"ఓ. సరే. అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను."

"ఆడవారి ముస్తాబు, అయిదు నిమిషాలంటే రెండు గంటలు."

"కావాలంటే, టైము చూస్తూ కూర్చోండి."

మీర ముస్తాబయి వచ్చేసరికి శాము "పది నిముషా లయ్యాయి" అన్నాడు.

"ఈ షూస్ వేసుకోవడానికి రెండు నిముషాలు పట్టింది."

"నిన్ను మాటల్లో గెలవగలనా నేను ?" అంటూ నవ్వాడు, శ్యాము..

* * *

రోజులు గడుస్తున్నకొద్దీ, మీరకు తోచటమే కరువయింది. నవచైతన్యంతో నిండిన ఆమె జీవితం అక్కర్లేనంత విశ్రాంతికి అలవడలేక పోయింది. రోజూ గంటల తరబడి కూర్చొని, తను కాలే జీలో గడిపిన రోజులను, ఇప్పటి రోజులనూ పోల్చి చూసుకొనేది. అప్పటి రోజులు నిమిషాల్లా గడచి పోతే, ఇప్పటి రోజులు యుగాల్లా గడుస్తున్నాయి.

శాము ఉదయం ఎనిమిదింటికి బయటికి వెళ్ల డానికి ఉద్యుక్తుడై, తన తావుపాటి మొరటు [illegible] నిముషం తదేకంగా అటువేపే చూసింది. వెంటనే ఆమె మనసులో, గోపాలం అన్నయ్యవి మెరిసే బూట్లు మెదిలాయి.

"మీతో ఒక్కమాట చెప్పాలి."

"చెప్పూ."

"మీరు విన్నాక నవ్వకూడదు మరి."

"అలాగే."

"ఈ పల్లెలో నాకేం తోచటంలేదు."

"ఒక్క బీరువా పుస్తకాలు నాలుగయ్యాయి. కావాలంటే ఇంకా తెప్పిద్దాం. కుట్టుపని చేస్తూనే ఉన్నావాయె. ఇంకా ఏం కావాలి?"

"అది కాదండీ, ఈ పల్లెలో, పార్కు, రేడి యోయా ? సినిమానా, స్నేహితులా ? ఏం ఉన్నా యని ? అస్తమానం ఇంట్లో కూర్చోవటమే పని. విసుగేస్తోంది నాకు."

"వెంటనే రావటంలా, ఈ సుధ్యా ?"

"వస్తుందనుకోండి. కాని, తాను చెప్పే కబుర్లు నా కక్కర్లేనివి. నేను చెప్పేది తన కర్థం కాదు. ఆ పదేళ్ల పిల్లతో, నాకేం కాలక్షేప మవు తుంది ? చెప్పండి ?"

"అయితే, ఇక్కడి రైతు స్త్రీలతో కలిసి పోలాని కొచ్చి కలుపుతీస్తా నంటావా ?"

"చాల్లెండి. ఎవరైనా వింటే నవ్విపోతారు. నేనా పనులన్నీ చేయగలిగితే, ఈ గొడవే లేకపోయే దసలు."

"ఇంతకూ ఏంచేయా లనుకుంటున్నావో చెపుదూ."

"మీరు నవ్వుతారు."

"లేదంటూంటే ."

"నామీద ఒట్టు."

"అలాగే చెప్పు."

"ఇక్కడి రైతు స్త్రీలకు, పిల్లలకు, చదువు చెపుదామని ...."

శాము పక్కుమని నవ్వేశాడు. మీర బుంగ మూతి పెట్టి,

"నవ్వరాదని చెప్పానా ముందే ?" అంది.

"నవ్వక ఏం చేయమంటావో చెప్పు ?"

"నేను చెప్పినదాంట్లో నవ్వొచ్చే విషయ మేముందని ?"

"వారంతా, చేసే పనులు వదలిపెట్టి నీ శిష్య రికం అవలంబిస్తే వాళ్ల కాపురాల గతేమిటో చెప్పు చూద్దాం."

"రోజూ సాయంత్రంపూట, ఓ అరగంట, అంతే. ఎలాగయినా చెప్పి చూడండి" అంది మీర వేడుకుంటున్న కంఠంతో.

"వాళ్ళు ఒప్పుకోక పోతే ?"

"ఒప్పుకోకపోతే వద్దు."

"సరయితే" అంటూ వెళ్లిపోయాడు, శాము. మధ్యాహ్నం ఇంటికి రాగానే, అడిగింది, మీర.

"చెప్పారా వాళ్లతో ?"

"సాయంత్రం ఇటువేపు రమ్మన్నాను. నువ్వే చెప్పు."

మధ్యాహ్నమంతా ఏవిధంగా బోధపరచి, ఆ పల్లె టూరి ఆడవాళ్లను, చదువు నేర్చుకోవటానికి ఒప్పించగలనా అని ఆలోచిస్తూ గడిపింది, మీర. సాయంత్రం శాము ఇంటికి వచ్చాక, కొంతసేపటి

[illegible]
కూర్చోబెట్టింది.

తల నెరసిన బీరమ్మ, చెంపసరాల రామక్క, దుద్దులకు మారుగా, చుట్టిన తాటాకు చెవులకు పెట్టుకున్న, నల్లగా గారపట్టిన వెంకటమ్మ, క్రొత్తగా పెళ్ళయిన కెంపక్క, వీరంతా నోటి నిండా ఆకు వక్క నములుతూ, మీర ఏం చెబు తుందోనని ఎదురు చూస్తున్నారు. బీరమ్మ,

"ఏంటమ్మగోరు, కబురెట్టారట" అంది.

"పొలాల్లో కష్టపడి పనిచేయటంవల్లా, వాళ శరీరాలు దృఢంగా, ఆరోగ్యంగా ఉన్నాయి. ఎంత కష్టమయినా, ఓర్చుకోగలమన్న ధీమా కనిపి స్తోంది వాళ్ళ మొహాల్లో. ఎండలో పనిచేయటం వలన ఒంటి రంగు నల్లగా మెరుస్తోంది.

"బీరమ్మా, మీ కంతా చదువు నేర్చుకోవ టానికి ఇష్టమేనా ?"

"అయ్యో నా తల్లీ, సదుగులు గిదుగులు మా కెందుకమ్మా. ఏంటి సేసుకుంటాం సదివి ?"

"అలా కాదు బీరమ్మా—చదువు నేర్చుకుంటే, తీరికవేళల్లో మంచి మంచి పుస్తకాలు చదువుకో వచ్చు. అజ్ఞానం, మూఢ భావాలు పోతాయి."

"మాకు తీరికేది తల్లీ. ఒక్క పనం నడుం వాలుద్దామంటే తీరికనేదు గందా."

"బీరమ్మా, మీరంతా ఒప్పుకుంటే, మీకు మా ఇంట్లోనే చదువు చెపుదా మనుకుంటున్నా."

వెంటనే వాళ్ళల్లో గుసగుసలు బయలు దేరాయ్. ఇన్నేళ్ళొచ్చాక ఇప్పుడేం చదువన్నారు కొందరు. తీరికుండదని గొణిగారు కొందరు.

"సదూకోవాలంటే, బోల్డు డబ్బు గావాల్నటగా" రామక్క అడిగింది.

"డబ్బు విషయం, మీకేం బెంగపెట్టుకోకండి. నేను చూసుకుంటాను."

ఒక్క నిముషం అందరూ మౌనంగా ఉన్నారు.

"మీరంతా ఆలోచించుకొని, రేపు చెప్పండి" అంది మీర.

"అలాగే" అని అందరూ వెళ్ళిపోయారు. మీర ఉత్సాహమంతా దిగజారిపోయింది. తనంతట తాను పిలచి, ఉచితంగా విద్య నేర్పుతానన్నా, సందేహిస్తున్నవారిని చూచి, ఆశ్చర్యపోయింది. మళ్ళీ ఎవరూ రారనే అనుకుంది.

కాని మీర అనుకున్నట్టు కాక, మరునాడు సాయంత్రం వాళ్ళంతా వచ్చి, "అమ్మగోరూ" అని పిలచేసరికి, ఆశ్చర్యపోయింది మీర. ఉత్సా హంతో బయటికి వచ్చింది.

"మేమంతా సదుగు సెప్పించుకుంటాం తల్లీ" అంది బీరమ్మ. ఆమె కంఠంలో, చదువు నేర్చు కోవాలన్న ఆసక్తికన్నా, అమ్మగారి మాటకు గౌరవ మివ్వాలన్న భావమే వ్యక్తమయింది.

"సరే, చాలా సంతోషం బీరమ్మా. శుక్రవారం, సరస్వతిపూజ చేసి, పాఠాలు ప్రారంభిస్తాను. మీకు తెలిసినవాళ్ళనంతా తీసుకరా."

"అట్టాగే తల్లీ."

"నేను పలకా పుస్తకాలు తెప్పించి పెడతాను."

"అట్టాగే తల్లీ" అని వాళ్ళంతా వెళ్ళి పోయారు.

# అపస్వరం

ఈ సంగతి భర్తతో ఎప్పుడు చెపుతానో నన్న ఆత్రం మీరకు. సాయంత్రం శాము ఇంట్లో అడుగు పెడుతూండగానే,

"ఏమండీ, వాళ్ళంతా చదువుకోటానికి ఒప్పు కున్నారు. శుక్రవారం సరస్వతిపూజ చేసి, పాఠాలు మొదలు పెట్టేస్తాను. అప్పటికి పలక, పెద్దబాల శిక్ష తెప్పించి పెట్టేయండి" అంది.

ఏమో చెపుదామనుకున్న శాము, ఆమె ఉత్సా హాన్ని భంగపరచటానికి ఇష్టంలేక ఊరుకున్నాడు. మీర తన వూహాగానాలనంత వివరించింది. ఒక సంవత్సరంలోనే తన విద్యార్థినుల కంతా ఏవిధంగా తర్ఫీదు ఇచ్చి తయారుచేయ దలచుకుందో ఏకరువు పెట్టింది.

శుక్రవారం రానే వచ్చింది. మీర ఉత్సాహానికి అంతులేదు. తోటలోని పూలు కోసి, రెండు పెద్ద దండలు గుచ్చింది. బోరడితో చెప్పి, తోటలోని

---

టీచరు : ఒరేయ్ రంగా! మీ నాన్నకు సంవత్సరపు రాబడి ఎన్ని రూపాయిలు ?

రంగ : సాధారణ సంవత్స రానికి 365. లీపు సంవత్సరానికి 366 సార్.

టీచరు : నేను సంవత్సరానికి రోజులెన్నో చెప్పమనలేదు. ఆదాయం ఎన్ని రూపాయలో చెప్పమన్నాను.

రంగ : ఔను సార్! ఆకంపెనీ వాళ్ళు మా నాన్నకు రోజుకు రూపాయి మాత్రమే యిస్తారు.

రత్నవర్థన్ (పొనుకుమాడు)

---

ఓ అరటిగెల తెప్పించింది. గోడకు వేలాడగట్టిన సరస్వతి దిగి, అలంకరించిన మేజా బల్లమీద ఆసీనురాలయింది.

సాయంత్రం కొత్తచీర కట్టుకొని తన శిష్యుల కోసం ఎదురుచూడ సాగింది, మీర. ఐదు దాటాక ఒక్కొక్కరే రావటం మొదలెట్టారు. ఓపది మంది వచ్చాక మీర, అగరువత్తుల వెలిగించి, సర స్వతిపూజ చేసి, రెండు దండలతో నిండుగా అలంకరించింది. వెంకమ్మగారు, రసాయనం, వడ పప్పు తెచ్చి, దేవి ముందు పెట్టారు. మీర నీళ్ళు చిలకరించి, నైవేద్యం పెట్టింది. తరువాత దొప్ప ల్లో అందరికి ప్రసాదం పంచిపెట్టింది. ఒక పూలదండ తీసి, ముక్కలుచేసి అందరికి ఇచ్చింది.

రామక్క కౌతుకంతో సరస్వతి పటంవేపు చూస్తూ,

"ఇదే అమ్మోరు, తల్లీ. కాలికామ్మా ?" అని అడిగింది.

[illegible] రామక్కా. ఈమె సృష్టికర్త బ్రహ్మ భార్య, సరస్వతి. విద్యాధిదేవత. ఈమె ...."

"తల్లీ ...." అంది వెంకటమ్మ.

మీర మరో స్వారస్యమయిన ప్రశ్నకోసం ఆటు జరిగింది.

"మీరు కట్టుకున్న కోక రంగు వెలవదా ?"

మీర ఉత్సాహమంతా దిగజారింది.

"నే నింకా తడిపి చూడలేదు."

కెంపమ్మ దొప్పలోని రసాయనాన్ని చూపుతూ,

"ఇదెట్టా సేసారమ్మగోరూ" అంది.

మీరకు కోపమొచ్చినా కనబడనీయకుండా, ఓర్పుతో, రసాయనం తయారుచేసే విధానం తెలిపింది. తరువాత అందరికి ఒక్కో పలకా బలపం ఇచ్చి, అక్షరాభ్యాసం మొదలుపెట్టింది అందరి పలకల్లోనూ 'అ ఆ' రాసి దిద్దటం నేర్పింది. పావు గంట దిద్దాక ఆ అక్షరాలను చూస్తూ క్రింద రాయమని చెప్పింది.

"అ. అంత బిరాన రాసటానికి ఇదేం కలుపు తీసే పనా ?" అంది కెంపమ్మ.

రామక్క 'అ ఆ' లు రెండింటినీ తల్లక్రిందు లుగా దిద్దుతోంది.

"అలా కాదు రామక్కా" అని మీర పలక పుల్ల సరిగా పట్టుకొని, దిద్దటం నేర్పింది. అటే చూస్తున్న కెంపమ్మ.

"ఎట్టా దిద్దితే ఏటమ్మగోరూ. దానిలా ఉంటే కాదా?" అంది.

"ముందు మజ్జిగాన్నం తిని, తరువాత, చారు అన్నం తినం గదా ? ఆకలి తీరటమే ముఖ్య మయి నప్పుడు, అదెందుకు కూడదో చెప్పు ?" మీర నవ్వుతూ అడిగింది కెంపమ్మను. ఏం బదులు చెప్పాలో తెలియక బిత్తరిచూపులు చూసింది కెంపమ్మ.

"ప్రతి పనికీ ఓ మొదలు, చివర ఉంటాయి. దేనికైనా ఓ పద్ధతంటూ ఉండాలి.

చీకటి పడుతూండగా, బోరడు, లాంతర్లు వెలి గించి తెచ్చిపెట్టాడు.

"మీరమ్మగోరూ, మే మింక ఇంటికెళ్తాం" అంది బీరమ్మ.

"అప్పుడేనా ?"

"అవును తల్లీ. మొగోళ్ళు వచ్చేయాలికి సంకటి తయారుగా ఉంచాలిగందా మరి."

అందరూ లేచి ఇళ్ళవేపు వెళ్ళిపోయారు.

రాత్రి మీర భర్తతో ఆరోజు జరిగిందంతా వివరంగా చెప్పుకొచ్చింది. శాము ఎగతాళిగా నవ్వాడు మీర చిరుకోపంతో,

"అదే వద్దంటున్నా, మరి. నాకు కోపం వస్తుం దంతే" అంది.

"లేదండి రాణీగారూ. తప్పయింది. లెంప లేసుకుంటున్నాను."

"ఇక రెండేళ్ళలో వాళ్ళనంతా, లోయర్ సెకం డరీ పరీక్షకు, కష్టేలా తయారు చేస్తాను. చూడండి."

శాముకు నిద్ర వచ్చేదాకా, మీర కబుర్లు చెప్తూనే ఉంది.

(సశేషం)

**5-3-1965 శుక్రవారం మొదలు**
**11-3-1965 గురువారం వరకు.**

### మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం ప్రారంభంలోనే కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరిగినా, తరువాత వృత్తి వ్యాపారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీకు నష్టం కలిగించడానికి చేసే ప్రయత్నాలు చివరకు మీకు లాభదాయకంగా మారతాయి. వృత్తిలో సాటివారి పోటీని ఎదుర్కొని విజయాన్ని సాధిస్తారు. ఉద్యోగంలో పలుకుబడి బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి అంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. ప్రయాణాలు లాభిస్తాయి. అశ్వినీ నక్షత్ర జాతకులకు మాత్రం ఆరోగ్యం అంత బాగుండదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్రను నిర్వహిస్తారు.

### వృషభం:

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి మృగ 1, 2 పా)

ఈ వారం అన్నివిధాలా ప్రోత్సాహకరంగానే ఉంటుంది కాని, మీరు క్షణం కూడా విశ్రాంతి లేకుండా, ఎంతో కృషి చేస్తేనే గాని ఏ వ్యవహారమూ నెరవేరదు. వ్యాపారంలో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో మీకు కొంతమంది మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మీమీద నిందా ప్రచారం చేయడమే పనిగా పెట్టుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు ఇంకా అంత బాగా ఉండకపోవచ్చును. బంధువుల వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావడంవల్ల ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి. శుభకార్యాల విషయంలో కొంచెం అభివృద్ధి ఉంటుంది.

### మిధునం:

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా)

వృత్తి వ్యాపారాల్లో గతవారం కంటే ఈవారం బాగా ఉన్నదని మీరు భావించదగిన మార్పులు వస్తాయి వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు సమయానికి తను అసహాయతను వెలిబుచ్చినా, మీ సామర్థ్యం వల్లనే వాటిని చక్కబెట్టుకుని తగిన ప్రయోజనాన్ని పొందగలరు. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా వారాంతంలో అనవసరమైన వ్యయం చేయవలసి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో మీరు యిది వరకు చేసిన వాగ్దానాలవల్ల ఇబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ఉద్యోగినులకు మంచి సమయం.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| బు చం | గు | రా | |
| ర శు శ | వారఫలం మహేష్ | | |
| | | | కు |
| | కే | | |

### కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఆదాయం బాగానే ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో ఎప్పుడు ఏమిటి జరుగుతుందో అనే ఆందోళన కలిగించే పరిస్థితి ఏర్పడడం వలన ఈవారం అంత సంతృప్తికరంగా ఉండదు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో కలిగిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపారం భారీయెత్తున చేయడంవలన ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడి రావచ్చును. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీకు యిష్టం లేకపోయినా, బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వైద్యులకు, రాజకీయ నాయకులకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా, నిర్లక్ష్యం చేయతగదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విలాస వస్తువులు కొంటారు.

### సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం ఆర్థిక వ్యవహారాల్లో కంటే ఆరోగ్య విషయంలో శ్రద్ధ చూపించడం అవసరం. వారం ప్రారంభంలో, వ్యాపారరీత్యా చేయవలసిన ప్రయాణాలు లాభదాయకంగా కనిపించినా, వాయిదా వేయడం మంచిది. వృత్తి వ్యాపారాలు వారంలో మొదటి భాగంలో కంటే రెండవ భాగంలో బాగా ఉంటాయి. వృత్తిలో మీకు ప్రయోజనకరమైన ఒప్పందాల విషయంలో వారాంతంలో అకస్మికంగా అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో ఎవరినీ, విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిది కాదు. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పముగా ఫలిస్తాయి. పారిశ్రామిక వేత్తలకు మంచి సమయం.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొద్ది మార్పులతో నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

### కన్య:

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో వారం మధ్యలో అనవసరమైన వ్యయప్రయాసలకు గురి అయినా, వారాంతానికి, మీ కృషికి తగిన ప్రతిఫలాన్ని పొందగలరు. భారీయెత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో కొంతమంది వ్యక్తులు తమ స్వార్థానికి మిమ్మల్ని వినియోగించుకోవడానికి ప్రయత్నం చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందవచ్చును. కోర్టు వ్యవహారాల్లో ప్రతిపక్షాల వాదం బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. వారాంతంలో సంతోషకరమైన వార్తలను వింటారు. చిత్తా నక్షత్ర జాతకులకు మాత్రం ఆరోగ్యం అంత బాగా ఉండకపోవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. ఎవరితోను వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. శుభమూలంగా ధనవ్యయం జరుగుతుంది.

### ఈవారం ధరలు

అపరాల ధరల్లో ఒడుదుడుకులు వచ్చినా మొత్తంమీద పెరుగుదల ఉండదు. బెల్లం ధర కొంచెం పెరుగుతుంది. చింతపండు ధర కూడా పెరగవచ్చును. నూనె, నువ్వుల ధరలు నిలకడగా ఉంటాయి. బట్టల ధరలు కొంచెం పెరుగుతాయి.

### తుల:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరు వరకు నిలువదు కాబట్టి వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన ఫలితంతో సంతృప్తి పొందడం మంచిది. ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు కొంత జరిగేసరికి ఆ యితరులు జారిపోవడం వల్ల మొత్తంమీద మీరే వహించవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉన్నా, రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన తాత్కాలికమైన యిబ్బంది కలుగుతుంది. వృత్తిలో సాటివారితో పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు వాయిదా వేయడం మంచిది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. పుణ్యకార్యాలు చేస్తారు.

### వృశ్చికం:

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి వ్యాపారాల్లో ప్రతి వ్యవహారమూ లాభదాయకంగా ఉన్నట్లే ఉంటుంది. అందరూ అనుకూలంగానే ఉంటారు కాని వారాంతానికి మీరు పొందిన శ్రమా, ప్రతిఫలం లెఖ్ఖవేస్తే ఈవారం అంత సంతృప్తికరంగా ఉండదు. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనకరమైన మార్పులు వస్తాయి. రావలసిన డబ్బుమీద ఆధారపడి నూతన వ్యవహారాలు ప్రారంభించడం మంచిదికాదు. ఉద్యోగంలో మెప్పుకురాని బాధ్యతలను వహించవలసి వస్తుంది. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు:**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని దెబ్బగొట్టడానికి ప్రయత్నించినా, మీరు నిగ్రహంగా ఉండి మీ స్వంత వ్యవహారాల్లోనే దృష్టిని కేంద్రీకరించడం మంచిది. ఇదివరకు మీరు నిరాశ చెందిన వ్యవహారాలు కూడా ఇప్పుడు సానుకూల పడతాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన సాటివారిలో మీ సామర్థ్యం రుజువు కాగలదు. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును. బంధుమిత్రులను కలుసుకొంటారు. వైద్యురాండ్రకు నంఘ సేవికలకు మంచి సమయం.

**మకరం:**

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈవారం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన వ్యవహారాలకు కూడా ఎంతో ప్రయత్నం చేయవలసి వస్తుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. ప్రయాణాల్లో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మార్పులకోసం ప్రయత్నం చేయడానికి ఇది సమయంకాదు. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు ఏర్పడడం వలన మానసికాందోళన కలుగుతుంది. కాని నష్టం యేమీ కలగదు. కుటుంబ వ్యవహారాల్లో యితరుల జోక్యంవల్ల భేదాభిప్రాయాలు రావచ్చును.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు. బంధువులను కలుసుకొంటారు.

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,పూ. భా. 1, 2, 3పా)

వృత్తి వ్యాపారాల్లో మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనడంవల్ల, ప్రయోజనకరమైన వ్యవహారాలు చేజారిపోతున్నా ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో కొంచెం శ్రమమీద యధాతథ స్థితిని నిలబెట్టుకొనగలరు. ఉద్యోగంలో మీరు ఏమి చేసినా, తప్పులు వచ్చే ఉద్దేశంతో కొంతమంది వ్యక్తులు ప్రవర్తించడం వలన మీ మంచితనం, సామర్థ్యం రాణించక పోవచ్చును. స్థిరాస్తి వ్యవహారాలు మాత్రం అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా ఉండడం మంచిది. సంతోషకరమైన వార్తలను వింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:**

(పూ. భాద్ర. 4 పా; ఉ. భా. రేవతి.)

వృత్తి వ్యాపారాల్లో కొంచెం అభివృద్ధిని సాధించినా, దాని నిమిత్తం మీరు పొందిన వ్యయ ప్రయాసలతో పోల్చినప్పుడు ఈ వారం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో మీకు సహాయం చేసేవారికి కొన్ని చికాకులు రావడంవలన మీకు కూడా యిబ్బంది కలుగుతుంది. వృత్తిలో మీరు ఏమాత్రం అశ్రద్ధగా ఉన్నా అవస్థ మీది, అనుభవం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడవచ్చును. ఉద్యోగంలో అనుకూలమైన వాతావరణం ఏర్పడుతుంది. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఉత్తరాభాద్రా నక్షత్ర జాతకులకు మాత్రం కొంచెం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ★

## జన్మదినఫలం

### మార్చి-5

వృత్తి వ్యాపారాల్లో కొంచెం అభివృద్ధిని సాధించినా, మీరు ఆ సందర్భంలో పొందిన వ్యయ ప్రయాసలతో పోల్చినప్పుడు యీ సంవత్సరం అంత సంతృప్తికరంగా కన్పించదు. వ్యాపారంలో కార్యసాధన కోసం మీకు అంతగా యిష్టంకాని వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసి వస్తుంది. వృత్తిలో ఆదాయంతోపాటు వ్యయం కూడా పెరగటంవలన మీరు ఆశించినంత అభివృద్ధిని సాధించడానికి అవకాశంలేదు. ఉద్యోగంలో మీకు వ్యతిరేకంగా ఏమీ జరుగదు కానీ అప్పుడప్పుడు ఆందోళన కలిగించే పరిస్థితి ఏర్పడవచ్చును. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ఫలించగల సూచనలు లేవు. ఆరోగ్యం బాగానే ఉన్నా, కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు కలుగవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

### మార్చి-6

ఈ సంవత్సరం అంత అనుకూలంగా ఉంటుందని ఆశించడానికి అవకాశం లేదు. సంవత్సరం ప్రారంభంలోనే మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొని పోవడం వృత్తి వ్యాపారాల్లో తగినంత శ్రద్ధ చూపించడానికి అవకాశం లభించక పోవచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు మాత్రం కొంచెం ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు లేనిపోని ఆశలు కల్పించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. రాజకీయ వ్యవహారాల్లో ఇంతవరకు మీకు సన్నిహితంగా ఉన్నవారే ప్రతిపక్షాల్లో చేరడంవలన తాత్కాలికంగా ఒదిగి ఉండవలసి వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యార్థులు మొదటినుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

### మార్చి-7

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వ్యాపారంలో కొన్ని వ్యవహారాలు మీ అదుపు తప్పి మీరు వూహించని పరిణామాలకు గురి అవుతున్నా, చూస్తూ వూరుకోవడం తప్ప ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడవచ్చును. ఇతరుల వాగ్దానాలను నమ్మి భారీ వ్యవహారాలు ప్రారంభించడంవలన తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది. వృత్తిలో కొత్తవారితో పోటీ రావడంవలన మీ కార్యక్రమాలకు మార్పులు రాగలవు. ఉద్యోగంలో ఇతరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళారంగాల్లో కొంచెం శ్రమమీద మీ కృషి రాణిస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. విద్యార్థులు కొంచెం శ్రమమీద మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

### మార్చి-8

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో సామాన్య వ్యవహారాలకు కూడా ఎంతో కృషి చేయవలసిన పరిస్థితి ఏర్పడడం వలన అప్పుడప్పుడు నిరాశ నిస్పృహలకు గురికాగల సూచనలు ఉన్నాయి. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండకపోవచ్చును. ఉద్యోగంలో కొంచెం శ్రమమీద యధాతథ స్థితిని కాపాడుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందవచ్చును. భారీ వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. ఆరోగ్య-విషయంలో జాగ్రత్త అవసరం. విద్యార్థులు శ్రమమీద సాధారణంగా కృతార్థులు కావచ్చును.

## మార్చి-9

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొన్ని అవాంఛనీయములైన పరిస్థితులు ఏర్పడినా, మొత్తంమీద తగినంత అభివృద్ధిని సాధించడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో మీకు ఇంతవరకు సహాయంగా ఉన్నవారికి చికాకులు రావడంవలన మీరు కూడా కొంచెం ఇబ్బంది పొందవచ్చును. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ముమ్ముందు బాగా ఉపయోగించగల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో అధికారులతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోవడం వలన మీ అభివృద్ధి మార్గం నిష్కంటకం కావచ్చును. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. కళాకారులకు, రాజకీయ నాయకులకు మంచి సమయం.

## మార్చి-10

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో గౌరవ ప్రాబల్యాలు బాగానే ఉంటాయిగాని ఆర్థికంగా విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు వ్యాపారంలో మీరు ఇదివరకు ప్రయత్నం చేసిన వ్యవహారాలు ఇప్పుడు సానుకూల పడతాయి గాని, ఫలితం మీరు వూహించినంతగా ఉండక పోవచ్చును. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చినా అందువల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. వృత్తిలో సాటివారితో పోటీ సంవత్సరం మధ్యలో కొంచెం తగ్గవచ్చును. ఉద్యోగంలో కార్య భారం పెరిగినా, మీ శ్రమను అధికారులు గుర్తించగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. ఆరోగ్యము ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయ తగదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## మార్చి-11

ఈ సంవత్సరం అన్నివిధాల అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో మీరు గత సంవత్సరం ఎంత ప్రయత్నం చేసినా, నెరవేరని వ్యవహారాలు ఇప్పుడు వాటంతట అవి నెరవేరగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల కంటె మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ వ్యవహారాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. మీకు ఎంత ఇష్టం లేకపోయినా, వృత్తిలో కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వం వంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది. ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును. దూరప్రయాణాలు చేస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. విద్యార్థులకు ర్యాంకు రాగల సూచనలు ఉన్నాయి. 

# వైజ్ఞానిక గాథాశతి

## 8

### డాక్టర్

## క్లోరోఫారము



నవంబరు 4 వ తేదీ, 1847 వ సంవత్సరము స్కాట్లెండులో డాక్టరు సింప్సన్ గారి ఇంట భోజనశాల. సింప్సన్‌గారూ, ఆయన సహాధ్యాయులు కీత్, డంకన్లూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూండినారు. ఉండుండి ఆ గదిలో గభీమని నిశ్శబ్దమావరించింది. కొంతసేపటి వరకూ ఎవరూ ఆ గదిలో ప్రవేశించలేదు. సింప్సన్‌గారి బట్లరు వచ్చి చూచాడు. ముగ్గురూ కుర్చీలలోంచి జారిపోయి భోజనాలు చేసే టేబిలు కింద స్మృతి తప్పిపడి ఉన్నారు. బట్లరు ఆశ్చర్య పడలేదూ, అరవనూ లేదు! నెమ్మదిగా ఒక్కొక్కరి దగ్గరా వంగి గొంతు దగ్గిర బొత్తాము పట్టు సడలించి, మెడగుడ్డ బిగుతువిప్పి మెల్లగా వెళ్లిపోయాడు. కొంత సేపటికి తెలివివచ్చి ముగ్గురు వైద్యులూ గడియారము చూచి హర్షధ్వానాలు చేశారు. బట్లరు వచ్చాడు. "బట్లర్ 'పోర్టువైను' తీసుకురా. ఏమలాగ తెల్లబోయి చూస్తావు?" అన్నాడు డాక్టరు సింప్సన్. "ఇంకానా బాబూ" అన్నాడు బట్లర్. సింప్సన్ నవ్వి, "ఇంకానా ఏమిటీ? మేము తాగనిదే?" అన్నాడు. బట్లరుకి ఏమీపాలుపోలేదు. దిగ్భ్రమతో అలాగే నిలబడ్డాడు. సింప్సన్ విరగబడి నవ్వి "మేము పడి ఉన్నప్పుడు నువ్వుగాని ఈ గదిలోకి వచ్చావా?" అన్నాడు. "వచ్చాను బాబూ". "ఈమెడ గుడ్డలూ బొత్తాములూ ఊడదీసినది నువ్వేనా?" "అవును బాబూ". "గొప్పవాడివి. వెనకటి బాబు గారికి చేసినట్టే చేశావన్న మాట! మేము ఇదో బాటిల్ పోర్టు తాగలేదు. క్లోరోఫారమ్ పీల్చాము" అన్నాడు సింప్సన్. బట్లరు ఆశ్చర్యపడి "క్లోరోఫారమా బాబూ? ఆ ఫ్రెంచాయన ఎవరికో కుందేళ్లకి పెట్టావని రాసినదా? దాన్ని మీరు పీల్చారా? అపాయము కాదా బాబూ?" అన్నాడు. డంకను అన్నాడు: "డాక్టర్‌జీ నిజంగా ఈనాడు రోగులకూ సర్జనులకూ చాలా గొప్పరోజు" అని.

మానవుల బాధా నివారణకని, డాక్టర్ సింప్సనూ అతని అనుయాయులూ సాహసించి తామే క్లోరోఫారమ్ పీల్చి, అది కొంతసేపు పూర్తిగా స్మృతి తప్పించేస్తుందని నిరూపించిన ఆరోజు అసంఖ్యాక వ్రణబాధితులకు, అంతరింద్రియజాడ్య పీడితులకు, మంచిరోజు కాకేమి? ఈనాడు ఎంత మంది ప్రతిరోజూ నొప్పిలేని చికిత్స చేయడానికి ఉపయోగిస్తోందీ క్లోరోఫారమ్?

ఫారడే, డేవీ అని ఇద్దరు వైజ్ఞానికులు పందొమ్మిదో శతాబ్ది ప్రారంభములో నైట్రస్ ఆక్సైడ్ వాయువుని పీల్చితే స్మృతి నష్టమవుతుందని చెప్పేరు. వారు దాన్నీ ఈథరునీ పీల్చి నిరూపించి చూపేరు. బోస్టను నగరపు దంతవైద్యుడు హొరేసువెల్సు మొట్టమొదటిగా దంతరోగ బాధితులకు నైట్రసాక్సైడు పీల్పించి చికిత్స చేశాడట. 1847 లో ఫ్రెంచిదేశీయుడు ఫ్లోరెన్సు "క్లోరోఫారమ్ ద్రవపు ఆవిరితో చిన్నజంతువుల వర్తనము" అన్న వైజ్ఞానిక వ్యాసము ప్రకటించాడు. దానిని వైద్య ప్రపంచము గుర్తించనే లేదు. సల్ఫ్యూరిక్ ఈథరు వాడడములో సాధనాల బాదరబందీ ఎక్కువ. మార్షల్‌హాల్ ఆ ఆవిరి ప్రభావాన్ని వర్ణించినది చూసి సింప్సను క్లోరోఫారమ్ అంతకంటె ఉపయోగానుకూలత ఎక్కువ కలిగి ఉండాలి అని అంచనావేసి, మానవులపై క్లోరోఫారమ్ ప్రభావాన్ని నిరూపించాడు. ఆ సోదా ఇంకొకరి మీద కాకుండా తమ మీదనే వేసుకున్న ఆవైద్య త్రయమెంత పూజనీయులు!

కొన్నాళ్ల తర్వాత ఎడింబరో రాయల్ వైద్యశాలలో సింప్సను క్లోరోఫారమ్ ప్రభావము దాఖలా చూపించాడు. మతాధికారులు గోలుగు కున్నారట. "భగవంతుడు నిర్ణయించిన బాధానుభవాన్ని మాటు చేస్తున్నాడీయన" అని. మానవుల బాధానివృత్తికై ప్రభువు నిర్మించిన వస్తువును కనుక్కున్నాడని ఎందుకనుకోలేదో! 

# సంపెంగలూ నన్నజాజులూ

అవసరాల రామకృష్ణారావు

## జ రి గి న క థ

మంజుల వివాహకారణంగా, ఆర్థిక అవసరాల దృష్ట్యా కొడుకుని కట్నం తీసుకొని పెళ్ళి చేసుకోమంటాడు తండ్రి; మొదట నిరాకరించినా చెల్లెలి పైగల ప్రేమతో తర్వాత సరే నంటాడు. తర్వాత మంజుల వివాహ మవుతుంది. ఆరేళ్లు గడిచాయి. మంజు యీలోగా బియ్యే పట్టాతోబాటు నాలుగేళ్ల మధురిమను కూడా పొందింది. భర్తతో కాశీవెళ్లి ఎం. ఏ. పరీక్షలు బాగా రాశానన్న తృప్తితో తిరిగివస్తూ అన్నయ్య సంసారం ఆందోళనకరంగా ఉండటం గమనిస్తుంది. భర్త పరీక్ష పాస్ కాలేకపోయినందుకు బాధపడుతుంది మంజు. వాళ్ళ సంసారంలో అపార్థాలు చెలరేగి మళ్ళీ సద్దుకుంటాయి. ఎం. ఏ. ఫైనల్‌కి వెళ్ళాలని ఉబలాటపడ్తున్న మంజుకు అశాభంగం కలిగేలా ప్రవర్తిస్తాడామె భర్త. చివరికెలాగైతేనేం ఎమ్మే పాసైనా ఉద్యోగం చెయ్యననే షరతుపై భర్తని ఒప్పిస్తుంది. కలతలతో కుంటుపడ్డ నారాయణ విమలల సంసారాన్ని ఒకదారికి తెస్తుంది మంజు. మంజు, మధుర కలసి పరీక్షలకు కాశీ వెళతారు. అక్కడ మధుర కేశవరావుల స్నేహాన్ని అనుమానిస్తుంది మంజుల. తమ స్నేహంలోని పవిత్రతను వ్యక్తం చేస్తుంది మధుర.

## 11

తల వంచుకుని వ్రేలితో ఒళ్ళోమీద గీస్తూ మధుర అంతకుముందు రోజు జరిగినది ఆమెకు పద్ధతిగా పూర్తిగా విరుద్ధంగా అతి నెమ్మదిగా మెల్లిగా చెప్పింది.

చంటిపిల్లాణ్ణి తల్లి రెండు అరచేతుల్లోనూ ఉంచుకుని అటూ యిటూ వూగించినట్లు గంగా తరంగాలపై ఉయ్యాల లూగే నావ. తియ్యని వూహలతో సయ్యాటలాడే తరుణ వయస్కులు.

'ఇలా మన మిద్దరం పడవలో ప్రయాణం చేస్తుంటే నీకేమనిపిస్తోంది మధురా ?' అన్నాడు కేశవ. ఇద్దరం పడవకు చెరో చివరనా కూచున్నాం, దూరంగా ఉన్నాం. కాని, ఒకరి కొకరు చెప్పలేనంత సమీపంలో ఉన్నాం.

'ఇన్నాళ్లూ పరీక్షలని నిన్ను డిస్టర్బ్ చెయ్యలేదు. ఇవాళికి నా మనస్సులోది చెప్పకుండా ఉండలేను. నువ్వలా వూరుకుంటే లాభంలేదు. మనిద్దరం ఒకే రిక్షాలో కూచుని వెడుతూంటే చూసేవాళ్ళు ఏమనుకున్నారని నీ కనిపించింది మధురా ?'

'మీకు నేనేమని జవాబు చెప్పగలను కేశవా ! మనిద్దరం కలసి ప్రక్కప్రక్కల నిలబడి విశ్వనాధుడికి హృదయపూర్వకంగా నమస్కారం చేసినపుడు మీకేమనిపించింది కేశవా ?'

కొన్ని ప్రశ్నలకు జవాబు అనవసరం. కొన్ని అనుభవాలకి వ్యాఖ్యానం అనవసరం.

'ఇంకొక్క ఏడాది. నీ చదువూ, నా రీసెర్చీ అన్నీ అయిపోతాయి. అప్పుడిక మన వివాహానికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదు.' ఇదే ఆయన చెప్పింది. మొదట్నుంచి చివర వరకూ అతడు చాలా సభ్యతతో ప్రవర్తించాడు మంజులగారూ ! ఇంకా నాకే అనిపించింది గాని నా చేతిని తన చేతుల్లోకి తీసుకోడానికైనా ప్రయత్నించలేదు. 'నీ చేతికి ఈ గాజులు బాగుంటాయి. నీ రంగుకి యీ తిలకం నప్పుతుంది. రెండు జడలు వేస్తే నువ్వు బాగుంటావ్' ఇటువంటి ఒక్క ముక్క కూడా—నిజానికి నేనే ఆశతో ఎదురుచూసినది—అతని నోటినుండి రాలేదు. నా చదువు గురించీ, అతని రిసెర్చి గురించే మాటాడేవాడు. 'ఎంతసేపూ యీ కబుర్లేనా' అంటే 'ఇంకోరకం కబుర్లకి ఇంకా ముందు కాలముంది' అనేవాడు. అతనితో ఎన్నిసార్లు విశ్వనాధుడి దర్శనానికి వెళ్ళినా నాకు తనివి తీరేదికాదు. అంత దూరమున్న విశ్వనాథ్ గల్లీ కూడా 'ఇంకాస్త పొడుగుంటే దీని సొమ్మేం పోయిందో' అనిపించేది. అతడు పదేపదే పట్టుబట్టి చెప్పబట్టి గాని ఈ పరీక్షలమీద కూడా నాకు ఇంతగా దృష్టి నిలబడక పోనేమో.

ఆమె చెప్పేదంతా శ్రద్ధగా విన్నాను. ఆమె తల మీద చెయ్యి వేసి అభిమానంతో నిమిరాను.

'మీరిద్దరూ సరే అంటే సరే అనుకుంటే సరిపోతుందా మధురా! తల్లిదండ్రు లున్నారు గద!'

'నా విషయంలో అటువంటి ఆటంకాలేవీ ఉండవండీ. మానాన్నగారు నా మాట కాదనరు. ఒకవేళ కాదంటే నాపక్షాన వాదించడానికి మా అన్నయ్య ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. ఇంక అతని విషయం. వాళ్ళ అమ్మా నాన్నా ఎప్పుడో పోయారట. ఉన్నదల్లా సవతితల్లి. ఆవిడ కేశవ సవితి తమ్ముడి దగ్గరే ఉందిట. వాళ్ళకీ వీళ్లకి రాకపోకలు గాని ఉత్తరప్రత్యుత్తరాలుగాని జరిగి మూడేళ్ళు దాటింది. అన్నిటి మించి వాళ్ళదీ మాదీ ఒక్కటే శాఖ కూడా. ఇంక అడ్డేముంది? మిగిలిన కష్టమల్లా ఒక ఏడాది పాటు పగటి కలలుకంటూ కూచోడమే' అంది నవ్వుతూ. ఒక నిముషం ఆగి ''ఇప్పుడు చెప్పండి. అతనితో అలహాబాదు వెళ్ళడానికి అన్నివిధాలా మీరు అడ్డు పడ్డారు. అది పొరపాటు కాదంటారా?' అన్నది.

నేను నిశ్చయంగా అన్నాను.

'ఎంత మాత్రంకాదు. ఆవేశపూరితమూ అనాలోచితమూ అయినపని అది. ఎంతగా వాగ్దానాలు చేసుకున్నా సాంఘిక నియమాల్ని సాహసించి ఉల్లంఘించి సుఖపడ్డవారు తక్కువ. పెళ్ళికాని నువ్వు పరాయి పురుషుని వెంట వెళ్లడం ఎంతమాత్రం మన సాంప్రదాయ సమ్మతం కాదు. వయస్సులో ఉన్న యువతీ యువకులు ఏకాంతంగా కలుసుకున్నప్పుడు మనసు చేసుకున్న కట్టుబాట్లను శరీరాలు పాటిస్తాయను కోడం శుద్ధ తెలివి తక్కువ'

జవాబు రాకపోడం చూసి మధుర వైపు చూశాను. ఆమె కళ్ళు మూతలు పడి ఉన్నాయి. వెనుక సీటుకి జారపడి పడుకోవడమే గాక నోరు తెరుచుకుని తగుమాత్రం గుర్రు కూడాను!

* * *

ఉత్తరం చూసుకుని వదిన స్టేషనుకు వచ్చింది. మళ్ళీ ఒక్కర్తే.

'మంజూ నీతో మాట్లాడాలి రెండ్రోజులపాటు ఇక్కడ దిగి మరీ వెళ్ళు' అంది. వదిన అలా మాట్లాడ్డం ఆశ్చర్యం కలిగించింది. 'లేదు వదినా, మధురిమను చూసి ఎన్నాళ్ళో అయినట్లుంది. దాన్ని ఆ కామేశ్వరి చేతుల్లో వదిలి వచ్చాను. ఎలా ఉందో ఏమిటో. అదీగాక టెలిగ్రాం కూడా యిచ్చాను. ఆయన స్టేషన్‌కి వస్తారు. రెండ్రోజులుండి మళ్ళీ వస్తాగా. అప్పుడు ఏకంగా పదిరోజులుంటాను. ఇప్పటికి వదిలెయ్యి'

'అలాకాదు. పనుంది దిగు.'

'ప్లీజ్. మళ్ళీ వస్తానన్నానుగా?'

'మీ అన్నయ్యకు ఒంట్లో బాగు లేదు, చూసి వెళ్లవా?'

అంతకన్న పదునైన గాయం నా హృదయానికి వేరేముంది ? ఇంక నేను ముందుకి సాగలేక పోయాను.

'వింటున్నావుగా మధురా, యీ సంగతులన్నీ ఆయనతో చెప్పు. బుధవారం, తప్పితే లక్ష్మివారం వచ్చేస్తానని చెప్పు. మధురిమ అంతగా అల్లరి పెడితే బంట్రోతునిచ్చి పంపమని చెప్పు, ఏమంత దూరం కాదుగా? అన్నట్లు నా సామాను లన్నీ యిక్కడ దింపడం దేనికి, ఒక్కబట్టల పెట్టె మాత్రం తీసుకుంటాను. మిగిలినవి ఇంటికి జాగర్తగా చేరేస్తావుగా?'

'బాగుందండీ, నన్నో సామాను కింద జమకట్టి యింత పదిలంగా తీసుకెళ్ళి తీసుకొచ్చేరు కదా, మీ సామానులే నాకు బరువా? ఇంతకీ పాపం మా అన్నగారికేం జబ్బూ?'

నేను కూడా వదినవైపు ఆతృతగా చూశాను, ఆమెకు వినపడలేదో, వినపడనట్లు ఉరుకుందోగాని జవాబు చెప్పలేదు. ఇంతలో రైలు కదల్నే కదిలింది.

ఇల్లు చేరగానే ఆతృతగా మెట్లెక్కి లోపలికి

వెళ్లేను. అన్నయ్య పడక్కుర్చీ మీద పడుకుని ఏదో చదువుకుంటున్నాడు.

'ఏంరా యీ వేళప్పుడు యింట్లో ఎలా ఉన్నావ్? ఆఫీసుకు వెళ్ళలేదేం?'

'ఇవాళ మా ఆఫీసుకు శలవు. నువ్వేం అలా ఉన్నావ్, ఇదంతా పరీక్ష బడలికేనా? ఇంతకీ పరీక్ష లెలారాసినట్లూ, సెకండ్ క్లాస్ ష్యూరేనా?'

ఆఁ ఆఁ! ప్యాసైతే సెకండ్‌క్లాస్ వచ్చినంత ఫలం. నువ్వేం మరీ అంత నీరసంగా ఉన్నావ్?'

నేనింకా ఏదో మాటాడబోతూంటే వదిన చెయ్యి పట్టుకుని నన్ను గబగబా లోపలికి తీసుకుపోయింది, 'వేణ్ణీళ్లు సిద్ధంగా ఉన్నాయి. స్నానం చేసి ముందు భోంచెయ్యి ఎప్పుడనగా తిన్నావో కబుర్లకేం తరువాత చెప్పుకోవచ్చు' అంటూ.

వేడి వేడి నీళ్లు పోసుకుని వేడి వేడి అన్నం తినగానే కమ్మ కమ్మని నిద్ర కమ్ముకొచ్చింది. ఆ ప్రాణం ఎక్కడికి పోయిందో మళ్లీ రాత్రి తొమ్మిదింటికి గాని మెలకువ రాలేదు. అప్పటికి పిల్లలిద్దరూ వచ్చి భోజనాలు చేసి పడుకోడం కూడా జరిగింది.

'ఏమమ్మోయ్ ఊర్మిళాదేవి, లేచినట్టేనా?' అంటూ వదిన వచ్చింది.

'ఇప్పుడు మళ్లీ భోంచెయ్యలేను ఓ గ్లాసు మజ్జిగ తీసుకురా' అన్నాను. మొహం కడుక్కుని ఆ మజ్జిగ తాగేను. చల్లగా ఉంది. 'శ్రమంతా తీరిందా' అనిపించింది.

'ఇక్కడకు వస్తే ప్రాణమెంతో హాయిగా ఉంటుందొదినా ఇది నీలో ఉందో, ఈ జాగాలో ఉందో"

'రెండింట్లోనూ లేదు. 'పుట్టిల్లు' అన్న పదంలో ఉంది. కాని నీకీసారి ఆసుఖం యివ్వలేనేమో నమ్మా మంజూ!'

వదిన క్రిందకు వెళ్ళి అన్నయ్య పడుకుని ఉన్నాడని రూఢి చేసుకుని మళ్లీ పైకొచ్చింది.

'ఇలాంటి రాత్రి కోసమే ఎదురు చూస్తున్నాను. నీలాంటి దాని కోసమే ఎదురు చూస్తున్నాను. ఏంచెయ్యను. భరించే శక్తి నాలో నన్నగిల్లి పోతుంది. ఈ యింటి పరిస్థితేం బాగులేదమ్మా మంజూ'

నా గుండె ఆగినంత పని అయింది. అర్థంకాక మనసు గిలగిల కొట్టుకుంది.

'ఏం, ఏమయింది ఇప్పుడే మొచ్చింది?'

"మీ అన్నయ్యకు వంట్లో బాగులేదు అని నేను స్టేషన్‌లో చెప్పేను కదా నువ్వేమను కున్నావ్?"

'ఇంటికి వచ్చి అన్నయ్యను చూశాను. బాగా నీర్సంగా ఉన్నట్టు కనిపించాడు. కాని ఏదో జబ్బుతో ఉన్నట్టు మాత్రం నాకు అనిపించలేదు. ఇంకే విషయమేనా మాటాడుదామని నువ్వీ వంకతో నన్నిక్కడ దింపేవేమో అనుకున్నాను.'

'లేదు మంజూ. ఆయన జబ్బుతో బాధపడు తున్నమాట నిజమే. మొన్న నువ్వు కాశీ వెళ్లేటప్పుడు తను స్టేషనుకు రాకపోడానికి ఆ జబ్బే కారణం. ఇవాళ ఆఫీసుకు వెళ్ళకపోడానికీ అదే కారణం. శలవని చెప్పేరే అది అబద్ధం, ఈయనే ఆఫీసుకు శలవు పెట్టేరు! అజ్ఞానురాల్ని, నాకేం తెలుసు! చదువుకోక పోవడంవల్ల యింతింత దారుణమైన వష్టాలున్నాయని తెలుస్తే ఎలాగైనా బుర్ర బద్దలు కొట్టుకునైనా చదువుదునేమో.'

వెర్రి వదిన. ఈ చదువులవల్ల కనీస వైద్య జ్ఞానమూ, న్యాయశాస్త్రమూ యిలాంటివి తెలియవని ఆమెకు తెలియదు!

'మెడిసిన్ చదువుకుంటే గాని అవన్నీ ఎలా తెలుస్తాయ్?'

'ఏమో ప్రతి దానికీ నన్ను కొట్టి పారేస్తారు. ఒక్కలా బాధపడి పోతూ తనకే రోగమూ లేదంటారు. కడుపునిండా యింత తిండితినీ, కంటి



తీరిదా — యింత నిద్రపోయా విన్నాళ్లయిందో! ఆయనకు చెప్పగలిగేపాటి తెలివితేటలు నాకు లేవుగాని రోజు రోజుకీ ఆయన కృశించి పోతున్నారనే సంగతి మాత్రం స్పష్టంగా చెప్పగలను.

నా హృదయం దేవేసినట్లయింది.

'ఈమధ్య నాలుగైదు రోజుల క్రిందట ఒకనాడు రాత్రి ఏదో చప్పుడైనట్లయి గబుక్కుని నిద్రనుండి లేచాను. ఆయన పక్కగదిలో కూచున్నారు. మెడమీద ఉబ్బిన నరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. గుండె యింత ఎత్తున లేచి పడుతోంది శ్వాస అందనట్టు. ఆయన పడుతున్న ఆబాధ నాకళ్లతో నేను చూడలేక పోయాను. నా ప్రాణాలు పైనే పోయాయి. 'మరేంలేదు, కొంచెం ఆయాసంగా ఉంది. అంతే' అన్నట్టు సంజ్ఞ చేశారు. ఆ పరిస్థితుల్లో ఏం చెయ్యడమో నాకేం పాలు పోలేదు. పక్కింటి నిర్మలావాళ్ల నాన్నగారిని పిలుద్దామని లేచాను. ఆయన వద్దని తనకేం పరవాలేదనీ సూచించారు, మాట్లాడే స్థితిలో కూడా లేరు.

కొంత సేపటికి ఆ ఉధృతం తగ్గింది. 'కొంచెం ఏదైనా వేడి వేడిది తాగుతారా?' అన్నాను. వద్దన్నారు. లోపలికేదైనా పుచ్చుకుంటే ఆయాసం ఎక్కువవుతుందన్నారు.

ఆయన పడక్కుర్చీలో కూచున్నారు. నేను ఆయన పాదాల దగ్గర కూచున్నాను. నాతల మీద చెయ్యి వేసి నిమిరేరు. ఆస్పర్శతో మరి నా కన్నీళ్లు ఆగలేదు.

'ఏడవకు. ఏ పరిస్థితుల్లో అయినా ఎవర్నయినా ఏడవవద్దని పదేపదే చెప్పేవాణ్ణి నేను. నువ్వు ఏడుస్తే నామనస్సు ద్రవిస్తుంది. అలా జరుగుతే నాకు మళ్ళీ ఆయాసం ఎక్కువవుతుంది' అన్నారు. పమిట చెంగుతో కన్నీళ్లు తుడుచుకున్నాను.

కొంత సేపటికి ఆయన నిద్రపోయారు. ఆయన పాదాల దగ్గర నేనూ పడుకున్నాను. నాకు నిద్రపట్టలేదు. విషాదకరమైన అనేక ఆలోచనలు నాకే మాత్రమూ విశ్రాంతి లేకుండా చేశాయి. ఆనందకరమైన అనేక జ్ఞాపకాలు నన్ను అపహాస్యం చేశాయి.

ఒకరోజు ఎక్కడెక్కడో తిరిగి అలసిపోయి ఆయన ఇంటికివచ్చి యిలాగే పడక్కుర్చీలో కూచున్నారు. నేను గడప పక్క కూచుని చేటలో బియ్యం పోసుకుని రాళ్ళేరుతున్నాను.

'అవకాశం యిచ్చినా అర్థం చేసుకోరు మీ ఆడవాళ్ళు. అలసి వచ్చిన మొగుడికి కాస్త కాళ్ళు పట్టి పుణ్యం గడించుకోరాదూ?' అని కుడి కాలు ముందుకి చాపి, 'పధ్నాలుగు లోకాలు తిరిగినా దొరకదే, యిలాంటి పాదం!' అన్నారు. నేను నవ్వుతూ చేట పక్కకి పెట్టి కాళ్ళు పడదామని ఎడంచెయ్యి జాపితే కాలు వెనక్కి తీసేసుకుని నాచేతిని చేత్తో పట్టుకుని అరచేతిని ముద్దెట్టుకుంటూ 'పది కాలాలపాటు తపస్సు చేసినా దొరకదే యిలాంటి హస్తపద్మం!' అన్నారు. నా పాణిగ్రహణం చెయ్యడానికి ఆయనేం చేశారో నాకు తెలీదు. ఆయన పాదాన్ని పూజించడానికి మాత్రం నేను బంగారు పువ్వుల పూజ చేసివుంటాను. విస్ఫురమైనా సరే నిర్మాల్యమైనా సరే నీతిపథం విడువని పాదం అది. ఆయనతో చేతిలో చెయ్యి

నేసి కత్తి మీద సాములాంటి ఆ జీవితంలో అడుగులో అడుగు వెయ్యడానికి అన్ని విధాలా అడుగున ఉన్న దాన్ని నేనెంతటి దాన్ని!'

వదిన వెక్కివెక్కి ఏడ్వసాగింది. ఆడుతూ పాడుతూ, నవ్వుతూ నవ్విస్తూ, గాలికెగిరే చీర చెరగులాంటి, తేలిపోయే నీటి నురుగులాంటి ఈమె జీవితం ఏమైపోతోంది?

'వదినా, నువ్వు చెబుతున్నది నాకేం అర్థం కాలేదు. అన్నయ్య కేమయింది, ఇప్పుడెలా ఉంది? నాతో చెప్పకుండా ఎందుకుంచారు? నేనొకర్తిని బతికున్నానని మరచిపోయారా?'

'లేదమంజూ అది జ్ఞాపకం ఉంచుకున్నారు గనుకనే అది నీతో చెప్పకుండా ఉంచడం జరిగింది. ఈ ఆయాసం రెండుమూడు నెలలై ఆయన్ని పీడిస్తున్నా అందుకే నీకు చెప్పకపోవడం జరిగింది. కాని ఏ విధంగానూ ఆయనతో నేను సరిపోలను. ఆయనకున్న ఓర్మి ధైర్యమూ నాకు లేవు. అందుకే నిన్ను ఆపేశాను. ఇకనీకు చెప్పకుండా ఎలాఉంచను?'

వదిన చెప్పడం ప్రారంభించింది.

వదిన్ని చెప్పనియ్యకుండా నేనే నిలదీసి అడిగాను.

ఇలా లోలోపల రోగాన్ని పెంచుకుంటున్న మాత్రాన అన్నయ్య మనకు చేసే ఉపకారం మాత్రం ఏముంది? ఈమాత్రం లోకజ్ఞానం వాడికి నశించిందా? ఇలాటి త్యాగాల వల్ల ఎవర్నీ ఏవిధంగానూ ఉద్ధరించలేమని వాడికి తెలియక పోయిందా? ఉండు, ఇప్పుడే అడుగుతాను.' వదిన నా చెయ్యి పట్టుకుని కూచో బెట్టింది.

'ఏమైనా ఉంటే నన్నే అడుగు—ఆయన్నికాదు'

'అవును. నిన్ను కూడా అడగాలి ఈవిషయాలు ముందుగా నువ్వేనా నాతో ఎందుకు చెప్పేవు కావు? వాడిలేకపోతే లేకపోయింది, నీకైనా...' వదిన తనలో అనుకున్నట్టు అంది

''బాధలూ కష్టాలూ వచ్చినప్పుడు రెండవ ప్రాణితో చెప్పకుండా సహించడం ఆయనకే చెల్లింది. చిన్నారికి జబ్బుగా ఉందని నీకు తెలియబరచింది నేనే. ఇప్పుడు ఆయన ఒంట్లో బాగు లేదని నీప్రయాణం ఆపించేసి చెప్పుకుంటున్నదీ నేనే. తలకటి ఓర్పు సామాన్యులకెక్కడ వస్తుంది! చిత్రమేమిటంటే ఎంత ఎక్కువ బాధపడితే అన్నిసార్లు నిన్ను తలుచుకొనేవారు. 'ఏమండీ, మీ చెల్లిని పిలిపించ మన్నారా?' అని ఎన్నిసార్లు అడగనియ్యి తల అడ్డంగా ఆడించేవారు. 'మనకు ఆప్తులయిన వారు మరెవరున్నారని? ఈ విషయం తెలిసిన తరువాత చెప్పలేదని ఆమె మనసు ఎంత నొప్పెడుతుందో ఆలోచించారా?' అంటే కోపంగా చూసేవారు. ఒకరోజు ఏమైతే అయిందని నీకు ఉత్తరం రాద్దామని కూచున్నాను.

'మన కాపురం వేరు దాని కాపురం వేరు అన్న మాట మరచిపోయావా? అతడసలే సుకుమారమైన మనిషి. ఇంతకూ అదివచ్చి ఏం చేస్తుంది? రోగాన్ని చేత్తో తీసేస్తుందా? దాన్ని పిలిచి ఎందుకు యిబ్బంది పెట్టడం?' అని చాలా గట్టిగా కేకలేశారు. ఆ మాట నేను చివరిదాకా వినలేక పోయాను. పరీక్షకు వెడుతున్నావనీ కష్టపడి చదువుతున్నావనీ ఎలాగో ఇన్నాళ్లు భరించాను. నువ్వు వస్తున్నావని తెలిసి ఇక నిగ్రహించుకోలేక పోయాను.''

వదినను కౌగలించుకుని అలాగే కొన్ని నిమిషాల పాటు ఉండిపోయాను.

'చిన్నారి పోయిందగ్గర్నుంచీ వారి మనసు బాగా దెబ్బతింది. నేనింకా మొండిదాన్ని. దాని ఆయుస్సు కూడా పోసుకుని దెయ్యంలా తిరుగుతున్నాను. ఆయన మాత్రం ఇంకా కోలుకోలేదు. పైగా ఉద్యోగం కూడా....' అనేసి నాలిక కరుచుకుంది

'ఏమిటి ఉద్యోగం కూడా?' ఆతృతగా అడిగేను.

'వద్దు వద్దు దయచేసి నన్నింకేమీ అడక్కు. ఇంకా చెప్తే ఆయన నన్ను జన్మలో క్షమించరు.'

నేనెన్ని విధాల అడిగినా వదిన యింకేమీ మాట్లాడలేదు. పైగా గుక్క నీరు గ్రుక్కుకుంటూ అంది.

'ఎందుకు పెట్టేరు నాకీ పేరు? అనన్యమైన సహనమూ అనంతమైన ఆత్మవిశ్వాసమూ గల ఆగొరిదేవి ఎక్కడ, నేనెక్కడ!' వదిన పేరు



# చందన్ జీవితకాలపు ఉపయోగమునకు నిర్మితం

విపులంగా-పోల్చి చూడండి-అంతట మీకు తెలియు నది ఏమంటే: ఉక్కు సామానులన్నీ ఒక్కటే మాదిరిగావుండవు. సాధన సామగ్రి మరియునిర్మాణ నైపుణ్యం తీవ్రమైన స్వచ్ఛంద వ్యత్యాసమును కలిగించుతాయి—అదే చందన్‌కు సాటిలేని విశిష్టతను కలిగించింది. అది జీవితకాలపు ఉపయోగమునకు నిర్మించబడినది. ఉదాహరణగా, లోహపు రేకులు రోలర్‌తో చదును చేయబడి అత్యంత కచ్చితమైన ప్రమాణములకు యంత్రమూలంగా నిర్మించబడి, తృప్తి నిరోధకంగా దీర్ఘకాల మన్నికను గలిగించుతుంది ఎందుకనగా అది అధికంగా తరచు గావింపబడుతుంది-ఎక్కువ ఖర్చుగునట్టి ముందుగా జరిపే ప్రయోగం తరువాత విపులంగా కాచబడిన ఎనామెల్ ముగింపుచేయబడును. చందన్ ఉక్కు సామాను కొనుట మాత్రమేగాక, అది మంచిపెట్టుబడి అని ఎందుకు అనిపిస్తుందో మీరే గ్రహించండి.








చందన్ అమర్చుకోదగిన అరలుగల ఉక్కు అలమరలు మూయబడనివి, మూయబడినవి మరియు దానికు అరగల రకములతో లభించుచున్నవి —. స్టోర్లు, లైబ్రరీలు మొదలైన వాటికి దివ్యమైనవి.

చందన్ — గృహములకు, ఆఫీసులకు, మరియు సంస్థలకు.

—ఉక్కుసామానులో క్రొత్త విశిష్టతకు విరక గుర్తు

**చందన్ మెటల్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లి.**

**బరోడా-3**

CMP. 1041 A. TEL EVEREST/

అన్ని ముఖ్య కేంద్రములలో అధికారము పొందిన డీలర్లు గలరు.

అలివేలుమంగ అనినాకు తెలుసు. అది అన్నయ్య మంగళ అని మార్చినట్లూ తెలుసు. అది అందమైన పేరనే వరకూ నాకు తెలుసు. అందులో అంతరార్థం వదిన ఇప్పుడు చెబుతే తెలిసింది

భాగవతంలోని అష్టమస్కంధంలోని క్షీర సాగర మథన సందర్భంలోనిది యిది. అమృతం కోసం పాలసముద్రాన్ని మథిస్తే హాలాహలం పుట్టుకొచ్చి లోకాల నన్నిటినీ కాల్చి వేస్తూంటే దేవత లందరూ శివుడికాళ్ళ మీద పడ్డారుట. ఆ గరళం మింగడానికి సిద్ధపడి శివుడు 'ఏం విషం మింగమంటావా?' అని అడుగుతే జంకూ గొంకూ లేకుండా అలాగే అందిట పార్వతి, ఆవిడ కెంత ధీమావో! ఆ సందర్భంలో పోతన రాసిన పద్యం తెలుగు భాష ఉన్నన్నాళ్ళూ ఉండ తగినది.

మింగెడు వాడు విభుండని
మింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మదినమ్మినదో!'.

కష్టమూ క్లిష్టమూ అయిన సత్పథంలో భర్తకు తలలో నాలుక లా ఉండడమేగాక ప్రోత్సహించి పంపే భార్యకు ఎంత గుండె నిబ్బరం ఉండాలి! వదిన ఆ నిశిరాత్రివేళ వణుకుతున్న కంఠంతో పరిదీనమైన స్వరంతో చదువుతూంటే నాకళ్ళలో జలపాతాలే స్రవించాయి, నా హృదయంలో కడలులే పొంగేయి. 'ఇంతకీ అన్నయ్య ఉద్యోగం విషయంలో ఏంజరిగింది? ఆమాట సగం చెప్పి ఊరుకున్నావు దేనికి? ఇంతవరకూ చెప్పి యింకా సంశయిస్తావు దేనికి? నన్ను దారిలో అర్థంగించి నా సహాయం కోరింది ఇందుకేనా? ఏం మాట్లాడవ్?'

వదిన మాట్లాడ లేదు, అలా నిశ్చయంగా కూచుంది

'ఉద్యోగం కూడా ఊడింది కాబోలు. అంతకన్న ఏముంది! అన్ని విషయాలూ అన్నయ్యనే అడుగు తాను ఇంతకన్నా చెడిపోయేది ఏముంది?' వదిన మళ్ళీ నన్ను వెయ్యి పట్టుకు కూచో పెట్టింది.

'అన్నిటితోపాటు ఆయన మనశ్శాంతి చెడడానికి ఈమధ్య ఉద్యోగంలో వచ్చిన ఒడుదుడుకులు కూడా కారణమయ్యాయి మంజూ'

అన్నయ్య వాళ్ళ కొత్త ఆఫీసరు లంచగొండితనం ఆమధ్య బాగా ఎక్కువై పోయిందిట. ఏదో ఒక లైసెన్సు మంజూరు చేయించే విషయంలో అతడు రెండు వేలు పైగా పుచ్చుకున్నాడని వాళ్ళ ఆఫీసులో అట్టుడికినట్టుడికి పోయిందిట ఆమధ్య. ఆరోజుల్లో వాళ్ళ ఆఫీసరుతో సహా ఒకవాడు అన్నయ్య కాగితాలూ అవీ పట్టుకుని వాళ్ళింటికి వెళ్ళ వలసి వచ్చింది. అతగాడు మాటల సందర్భంలో అన్నాడట

'ఎందుకోయ్ నేనేదో తినేశానని అందరూ ఆడిపోసుకుంటున్నారటా? ఫలానావాడు లంచం తిన్నాడని పిటీషన్ పెట్టుకుందామని నువ్వెడితే అది చేరవలసిన స్థానానికి త్వరగా చేరడానికి గుమాస్తాగాడికి లంచం యివ్వవలసిన రోజులు గదా యివి! దానికంత కడుపుబ్బరం ఎందుకూ, ఎవరి ఛాన్సు వాడిదనుకోక! నేనొక్కణ్ణే చేస్తే అది పాపం అనుకోవచ్చు. అది సర్వసాధారణం గదా!'

'సారీ సార్ మీతో నేను ఏకీభవించలేను' ఆఫీసరు ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి చూశాడు. 'తమరు' తో ప్రారంభించి 'చిత్తం'తో ముగించే వాక్యాలు తప్ప ఇతరత్రా అతడు విని ఎరుగడు.

# సరిపెంగలూ సన్నజాజులూ

'ఏమిటీ, ఏమిటి నువ్వంటున్నది?'

'అందరూ అవినీతి పరులే ఉంటారనుకోడం ఆధారంలేని ఆరోపణ. మాట వరసకి వదేళ్ళ పని చేస్తున్నాను. నేను కాణీ పుచ్చుకోలేదు'

'నువ్వు పుచ్చుకోలేదంటే నేను పుచ్చుకుంటున్నానని పరోక్షంగా చెప్పడమా?'

'అలా ఎక్కడుంది? అయినా అది మీ స్వవిషయం. ఆ మంచిచెడ్డలు మీవే.'

'ప్రసాదరావ్, ఏదో తెలివిగా మాట్లాడుతున్నాననుకొని ఎవరితో మాటాడుతున్నావో మరచి పోయావనుకుంటాను'

'ఇంకా అంత దుస్థితికి దిగజారలేదు ఈ విషయాన్ని మొదట ఎత్తింది మీరే. పైగా లంచగొండితనాన్ని సమర్థిస్తారు దేనికి?' ఆఫీసరు ఇల్లెగిరి పోయేటట్టు నవ్వి అన్నాడట:

'నిత్యం జరుగుతున్న విషయాల్ని నీతులని పేరుపెట్టి దూషించడం దేనికోయ్? బంట్రోతు గాణ్ణి రూపాయి పెట్టి సిగరెట్టు తెమ్మంటే కనీసం అణా అయినా కమిషన్ కొట్టందే రాడే, అది లంచమే నంటావా?'

'తప్పకుండా. కాని కడుపుకాలి చేసిన వాడి తప్పు ఎనికి క్షమించడానికి అవకాశమైనా ఉంది. కార్లూ బంగాళాలూ వేలకివేలు జీతాలూ ఉండి సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూ కక్కుర్తి పడే నీచుల పాపానికిక నిష్కృతి మాత్రం లేదు!' ఈ మాటలు వింటున్న ఆఫీసరు ఒళ్ళు భగ్గున మండి పోయింది. కళ్ళు చింత నిప్పు లయ్యాయి.

'చాలించు నీ ఉపన్యాసం. ఇంతటి బుద్ధిమంతుడివనుకోలేదు— ఆ ఫైల్సు యిలా తగలేసి నీదరిని నువ్వు వెళ్ళొచ్చు' అన్నయ్య గబగబా వచ్చేశాడు. తొందర పడ్డానేమోనని మొదట కొంచెం విచారించినా 'మనసులో ఉన్న మంచి మాటను పైకి కక్కినందుకు విచారించడం కూడా దేనికి, సంతోషించక!' అని సరిపెట్టుకున్నాడట.

(సశేషం)




నాగవర్ధన

## విచిత్రకథలు-6

# దయ్యం నేర్పిన పాఠం



ఆర్. టి. కూపర్

నార్‌ఫోక్‌లోని ప్రశాంతమైన ఒక పల్లెటూరు రాన్‌వర్త్. ఆరోజు ఆదివారం. ఉదయం ప్రార్థన కాహ్వానిస్తున్న చర్చి గంటలు నెమ్మదిగా మ్రోగుతున్నాయి. కానీ ఆ ప్రశాంతతను భంగపరుస్తూ గుర్రపు డెక్కల శబ్దాలూ, తోడేళ్ల అపురుల్లాంటిధ్వనులూ వినిపించటం ప్రారంభించాయి. ఈ కోలాహలంతో చర్చికి వచ్చిన వారందరూ కలత చెందారు. దీనికంతటికీ కారణం చర్చి బయట సమావేశమైయున్న ఆ వూరిలోని వేటగాళ్లుచేసే కోలాహలం.

కల్నల్ థామస్ సిడ్నీ వాళ్లకు నాయకుడు. అతడు దుష్ట స్వభావానికీ, దుర్వర్తనకీ ప్రతిబింబం. రాన్‌వర్త్ ప్రజలన్నా, క్రైస్తవ మతమన్నా అతనికి ద్వేషం. దానికితోడు సిడ్నీ నాస్తికుడు.

వీళ్ల హంగామాకి చర్చిలోని మత బోధకుడొకడు భయపడకుండా ముందుకువచ్చి సిడ్నీని, అతని చర్యలను దూషిస్తూ "ఇది పవిత్రమైన ప్రదేశం. అనవసరంగా ఇక్కడెందుకీ గొడవ" అంటూ ప్రశ్నించాడు. దాంతో కల్నల్ కోపం కట్టలు తెంచుకుంది.

"ఏమిటీ! నన్నే ఎదిరించి మాట్లాడ్తావా? ఎన్ని గుండెలు నీకు? నీ ప్రాణాలు తీస్తాను" అంటూ తన చేతిలోని కొరడాని పైకెత్తాడు. అంతే! ఎత్తిన కొరడాని వృథా చెయ్యలేదు కల్నల్. పాపం! ఆ అమాయకుని తలపై కొరడా పిడితో గట్టిగా బాదాడు. ఆ దెబ్బకి అతను క్రిందపడి నెత్తుటి మడుగులో పొర్లాడసాగాడు.

కల్నల్ వికృతంగా నవ్వి గుర్రం ఎక్కి వెళ్లి తన వాళ్లముందు నిలబడ్డాడు. ఆవిధమైన నిర్దాక్షిణ్యం, క్రౌర్యం కల్నల్ రక్తంలో జీర్ణించిపోయాయి. నార్‌ఫోక్ స్క్వేర్‌లో ఎన్నదగిన పరమ దుర్మార్గుల్లో థామస్ సిడ్నీ మొదటివాడు.

కల్నల్ వాళ్ల వంశీయులవాదిరిగా పెద్ద పరాక్రమశాలీకాదూ, ఆటపాటలందు ప్రావీణ్యం ఉన్నవాడూకాదు. పైగా అతడు తన గుర్రానికి కూడా ప్రాణం ఉందనీ, కష్టసుఖాలు దానికీ ఉంటయ్యనీ తెలిసినట్లు అనిపించదు. దాని గొంతులో ఊపిరున్నంతవరకూ అది తనకి గెలుపుని మాత్రమే తెచ్చిపెట్టాలనే మూర్ఖుడు.

తరచుగా కల్నల్ వేటనుంచి తిరిగి ఇంటికి వచ్చేసరికి అతని గుర్రానికి ఒక ప్రక్కంతా కొరడా దెబ్బలతో శరీరం బద్దలై ఉంటుంది. నెత్తురు కాల్వలుకట్టే శరీరంతో ఆ అమాయకప్రాణి కల్నల్ కొరడాదెబ్బలకి ఓర్చుకోలేక,దారిలో అతని కాళ్లమధ్యనే నేలపై కూలిపోయి ప్రాణాలు విడవడం గూడా కద్దు. అంతమాత్రంచేత కల్నల్‌తో పోటీ ఎవరూ లేరనికాదు. చాలా కొద్దిమందికి మాత్రమే అలాటి క్రూరమైన చర్యలు చేయటానికి మనస్సొప్పేది.

"నేను మనుష్యులకీ, గుర్రాలకీ, దేవుడికీ, దయ్యానికీ భయపడను" అని తను గొప్పలు చెప్పుకునేవాడు.

ఆ పల్లెలో అంతా కల్నల్ మానవరూపంలో ఉన్న దయ్యం అనుకునేవారు. సైతాన్‌కీ, అతనికీ ఏదో ఒప్పందం ఉండివుంటుందని వాళ్లనమ్మకం. అతని దుర్నీతి చర్యలకు, ఆస్తికులైనవారి ఆలోచనలకి అంతకంటే ఇంకేమీ తోచలేదు. అతనితోబాటు వేటలో పాల్గొనేకొందరు, సిడ్నీముందు వెళ్తున్నప్పుడు అతనుతన వేటకుక్కలతోబాటులేడనీ, నల్లని గుర్రాన్ని ఎక్కి, నల్ల ముసుగు వేసుకున్న వో ఆకారం కూడా కల్నల్ వెంట ఉందనీ గుర్తించారు. కానీ ఆ అపరిచితవ్యక్తి మి తా వాళ్లకి పరిచయం లేకుండానే ఉండిపోయేవాడు. వాళ్లు కల్నల్‌ని కల్సుకునేసరికి ఆ ఆకారం అంతర్థానమైయ్యేది. "ఆ ఆకారం నరకంలోని అతని ప్రాణ మిత్రులలో ఒకడైవుంటుంది" అనుకునేవారు వాళ్లలో వాళ్లు. బహుశః వాళ్ల వూహ నిజమే కావచ్చు! కానీ ఓ చిన్న సందేహం : వేటలో నిర్లక్ష్యంగా ప్రవర్తించటంవల్లగానీ మితిమీరి త్రాగటం వల్లగానీ అతడు ప్రమాదానికి లోనై ఎప్పుడూ బాధపడలేదు. మేలుకున్నప్పుడూ, నిద్రించేప్పుడూ కూడా త్రాగుడు మైకంలోనే తేలియాడేవాడు. భోజనానంతరం కనీసం రెండు మూడు సీసాలు ఖాళీ చేసే ఆ రోజుల్లోనే ప్రజలీతని త్రాగుమోత్తనాన్ని తెగ పొగిడేవాళ్లు. అందులో అతను సాటి లేని మేటి అనిపించుకున్నాడు.

ఒకే ఒకసారి మాత్రం కల్నల్‌తో పోటీకి వచ్చాడింకొకడు.

పార్టీకి వెళ్ళిన సిడ్నీకి పోటీదారుడు తటస్థపడ్డాడు. అతడు కూడా ఆశక్తితో కల్నల్‌తోబాటు పోటీగా త్రాగటం ప్రారంభించాడు.

ఆ మర్నాడు బల్లలక్రింద ఒళ్ళు తెలీకుండా కొన వూపిరితోపడున్న పోటీదారుని ఆ యింటి సేవకులు చూశారు! వైద్య సహాయంతో ఎలాగో బ్రతికి బయటపడ్డాడా ప్రత్యర్థి.

కానీ కల్నల్ మాత్రం ఈమధ్య కాలమంతా వేటలో పూర్తిగా మునిగే ఉన్నాడు. ఆ పోటీదారుని విషయం సిడ్నీకి తెలిసి, "చాలా విచారకరమైన విషయం. ఆ వెధవ ఇంకా బ్రతికున్నాడా! త్రాగటం చేతకానివాడు బ్రతకటం అనవసరం" అన్నాడు పెద్దగా నవ్వుతూ నిర్లక్ష్యంగా. గుర్రపు పందెంలో తనని గెల్చిన వానిపై కూడా అతనికిదే అభిప్రాయం ఉంది. దాన్ని నిరూపించే సంఘటన ఒకటి జరిగిందొకసారి:

రోజంతా వేటాడి కల్నల్ తన బృందంతోబాటు యింటికి తిరిగిస్తున్నాడొకనాడు. తనకి ఎదురులేదని విర్రవీగే కల్నల్ తనతో పోటీకి రమ్మని అందులో ఒకతన్ని సవాల్ చేశాడు. పోటీ మొదలైంది. జీవితంలో అదే కల్నల్‌కి ఓటమి సంభవించటం. గుర్రపు పందెంలో అతని ప్రత్యర్థి చాలా ముందుకు వెళ్ళిపోయాడు.

ఈ సంఘటనతో సిడ్నీ అహంకారం దెబ్బతిన్నది. అతని గుర్రపు స్వారీ నేర్పునే గేలి చేసినట్లయింది. వెంటనే పిస్టల్ తీసి ప్రత్యర్థి గుర్రానికి గురిచూసి పేల్చాడు. ఆ దెబ్బతో గుర్రం వికృతంగా అరుస్తూ పల్టీ కొట్టి క్రిందపడి ప్రాణాలు

విడిచింది. దానిపైనున్న పోటీదారుడు ఎగిరి నేలపై పడ్డాడు. కల్నల్, క్రిందపడ్డ అతన్ని క్షణంలో సమీపించి అతనిపైనుంచి తన గుర్రాన్ని పరిగెత్తించాడు. గుర్రపుకాళ్ల తాకిడికి నలిగి అతడు మరణించాడు.

దీని ఫలితం మాత్రం చాలా తీవ్రంగానే ఉందనవచ్చు. ఆ పోటీదారుడు చనిపోయిన నాటి రాత్రి కల్నల్ తన ఇంట్లో పెద్ద విందు చేశాడు. అతని అతిథులందరూ చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో ముఖ్యులు, సిప్లీ మాదిరిగా భూస్వాములు. కల్నల్, వాళ్లందరికీ వైభవంగా ఆతిధ్య మిచ్చాడు. తర్వాత మితిమీరి త్రాగి ఆ మైకంలో మధువుతో నిండిన గ్లాసు నొకదాన్ని పైకి గాలిలోకి విసిరి అక్కడున్న వాళ్లని సంబోధిస్తూ "స్నేహితులారా! మీ గౌరవార్థం మీకిది ఇస్తున్నాను" అంటూ అరిచాడు. అతని మాట ఇంకా పూర్తిగా అమలుజరగక ముందే ఆ గది తలుపులు వాటంతటవి తెరుచుకున్నాయి పెద్దగా శబ్దం చేస్తూ. వెంటనే భయంకరాకారం ఒకటి అడ్డంగా ఉన్న వాళ్లని తోసుకుంటూ లోనికి ప్రవేశించింది. అక్కడున్న వాళ్లందరూ దాన్ని చూచి భయ విభ్రాంతులై వెనక్కు తగ్గారు. ముఖం మాత్రం కనబడేట్లు నల్లని పెద్ద ముసుగు ధరించిన ఆ భయంకరాకారం ముఖం తెల్లగా పాలిపోయి జీవకళ లేకుండా ఉన్నది. ఏదో లోకానికి సంబంధించిన వెలుగు ఆ ముఖంలో కనిపిస్తున్నది. క్షణంలో తన దృష్టిని ఆ గది నంతటినీ సారించిందా ఆకారం. తర్వాత సిప్లీ వైపు దృష్టిని మరల్చింది. కల్నల్ తప్పించుకుని పారిపోదామనుకున్నాడు గానీ ఆ అవకాశం అప్పటికే చేయిజారిపోయింది. కల్నల్‌ని సమీపించిన ఆ విచిత్ర శక్తి అతన్ని తన బాహువుల్లో బంధించి అందరూ చూస్తుండగానే చీకట్లోకి జారిపోయింది. ఈ విచిత్ర సంఘటనకి అక్కడున్న వారందరూ ప్రాణ్పడిపోయారు. వెంటనే ఆ గది వంటగది నుంచి వచ్చే ఆవిరితోనూ, గంధకం పొగతోనూ నిండి అక్కడున్న వాళ్లని మామూలు స్థితికి తెచ్చి ఉక్కిరిబిక్కిరి చేసింది భయంతో వాళ్లు ఎలాగైనా ఈ ఆపద నుంచి బయటపడాలని బయటికి పరుగెత్తారు.

బయటికి వచ్చినవాళ్లు, పెనుగులాడుతున్న కల్నల్‌ని ఆ వింత ఆకారం గట్టిగా బంధించి గుర్రంమీదికి లంఘించి వేగంగా రాన్‌వర్త్ పొలిమేరలవైపుగా వెళ్లటం చూశారు. ఆ తర్వాత వాళ్లు కల్నల్‌ని కానీ ఆ ఆకారాన్ని కానీ చూడలేదు.

ఈ సంఘటన డిశంబర్ 31, 1770 లో జరిగింది. కల్నల్‌ని ఎత్తుకుపోయినదెవరై ఉంటారు? అతని శత్రువుల్లో ఒకడై ఉంటాడా? అవకాశం కోసం యింతకాలం ఎదురు చూస్తూ ఉండి ఉంటాడా? .. ... ఏమైతేనేం దయ్యం మంచి గుణ పాఠాన్నే నేర్పిందని మాత్రం అంతా నమ్మారు.

ఇది జరిగిన తర్వాత ప్రతి సంవత్సరాదినాడూ రాన్‌వర్త్‌లోని కల్నల్ భవనంనుంచి విచిత్రమైన ఆకారం ఒకటి బాధతో అరుస్తున్న మనుష్యునొకడ్ని నల్లటి గుర్రంమీద తీసుకొని వేగంగా రాన్‌వర్త్ పొలిమేరలవైపు వెళ్లటం జరిగేదని చెప్పుకునేవారు.

కొన్ని సంవత్సరాల క్రిందట ఒక విచిత్రం జరిగింది. ఇద్దరు వ్యక్తులు చేపలు పట్టుకుంటూ కాలక్షేపానికీ విషయం గురించి మాట్లాడుతూ, అదంతా పుక్కిటి పురాణంలాంటి కథ అని అనుకొంటున్నారు. వెంటనే భయంకరమైన పెద్ద ధ్వని వాళ్లకి విన్పించింది. మరుక్షణంలోనే మహా సముద్రంలో పెద్ద రాయి చాలా ఎత్తునుంచి పడటంతో నీళ్లు చింది వాళ్లపై పడ్డాయి. దాంతో వాళ్లకి చలనం కలిగింది. అలా చింది వాళ్లపైపడిన నీళ్లు భరించలేనంత వేడిగా ఉన్నాయి. అవి వాళ్ల ముఖాలపైపడి చాలా బాధ కల్గించినవని వాళ్లు తమ విచిత్రానుభవాన్ని వివరిస్తూ చెప్పారు.

(అయిపోయినది) ★



# మహారాజ యోగం

పి. ఎస్. నారాయణ

సింహాద్రి లేచి నిలబడ్డాడు. ఒక్కసారి కాళ్ళూ, చేతులూ ఝాడించి, ఎవరిచేతులోనో ఉన్న హుక్కాను విసురుగా లాక్కొని నాలుగు దమ్ములు గుడగుడా లాడించి బయటపడ్డాడు.

ఏమిటో వూరంతా హడావుడిగా ఉంది. కోట ద్వారాల నుండీ, రాజమార్గమంతా ఇసకేస్తే జుట్టు మీద పడేంతగా కిక్కిరిసిపోయి ఉంది. సింహాద్రికేం అర్థంకాలేదు. రెండు రోజుల క్రితం ఎవరి దేవిడీలోనో సంతర్పణయితే భోంచేసి కోట ముంగిట ఉన్న ఈ సత్రపు అరుగుమీద మేనవాల్చి కునుకు కుపక్రమించినట్టు గుర్తు ! . తరువాత మెలుకువ వచ్చి చూస్తే ఈ హడావుడి !

పంచె పైకెగదీసి కట్టి ముందుకు జనసముద్రంలో ఎదురీది తలెత్తి పైకి చూస్తే వంద గజాల దూరంలో సింహం నోరులా, రాజావారి బోసులా, మరేదోలా కోట ద్వారం కనబడింది. రాజ భటులంచే వెనక్కి నెట్టబడుతున్న మొట్టమొదటి వారికి వెనగ్గా ఉన్నాడు తను.

తల సగం వాల్చి సవినయంగా అడిగాడు రెండు తలకాయ లవతలున్న ఒక గండు మీసాలాయన్ని సింహాద్రి "ఏమిటీ హడావుడి అంటా ?" అని దానికి సమాధానంగా ఆ పెద్దమనిషి తాటిచెట్టు మీద నుండి క్రిందనున్న పూచికపుల్లను చూచి నట్టుగా సింహాద్రిని చూచి, మీసం మెలేసి, కళ్లల్లో గుప్పెడు నిప్పులు వేసుకొని, కాస్త రాజ రీవితో హూంకరించి "బ్రతికిపోయావ్ పో ! ఒక్క ఐదు నిముషాల తరువాత అడిగిఉన్నట్లయితే నీ తల తీయించి, నీ శరీరాన్ని నా శత్రురాజు పుట్టినరోజు కానుకగా పంపివుండేవాడిని !" అని క్షణంలో చూపు మార్చేశాడు

సింహాద్రి బిక్కచిక్కిపోయి కొయ్యలా బిగుసుకు పోయాడు. "ఇదేమిటీ .... ఇంకా నయం ఐదు నిముషాలు ముందడిగాను ... లేకపోతే ఈపాటికి నా శరీరం కాస్తా ...." అనుకో—

జనం గోల సముద్రపు హోరులా లేచింది మాడిన మసాలా దినుసుల వాసనలా పాకిపోసాగాయి.

ఎవరి నోట విన్నా 'రాజావారి పట్టేను గొచ్చేస్తోంది!' అనే ! ప్రతివాళ్ళు వాళ్ల మెడలను ముందుకు పోటాపోటీలుగా, ఏనుగు మావటీడుకు ఒక్క మెడకాయలే కనబడేలా, ఏనుగు తొండం దగ్గరకు సాగదీస్తున్నారు. దాని తొండానికున్న తెల్ల మల్లెపూల దండమీదే దిష్టి తగిలేలా అందరి దృష్టి వున్నది !

అసలు సంగతి—

హఠాత్తుగా అర్ధరాత్రి పన్నెండు గంటల సమయంలో ఆ దేశపు రాజావారు కన్ను మూశారు. తరువాత పన్నెండు గంటలలోగానే మరో రాజావారిని గద్దె ఎక్కించటం ఆ దేశపు ఆచారం… .. అందుకుగాను రాజావారి పట్టేనుగు ఎవరి మెళ్లో మల్లెదండ వేస్తే, వారు మహారాజు అవ్వటం కద్దు!

కాని సింహాద్రికిదేం తెలియదు. అందుకనే తన మెడని తన దగ్గిరే పెట్టుకొని వింతగా చూస్తున్నాడు.

కాని విధి మరోలా వుంటే సింహాద్రి ఏం చేయగలడు ? …. ఆ పట్టేనుగ కాస్తా తెల్ల మల్లెపూల దండను పరుగెత్తుకుంటూ వచ్చి అతడి మెళ్లోనే వేసింది !

మరుక్షణంలోనే ఒక భటుడు ఒంటిచేత్తో సింహాద్రిని ఆకాశంలోకి ఎత్తేసి, నాలిక్కరుచుకొని, చేతిని క్రిందకు లాగేసి, 'మీ పేరు ?' అంటూ చెవులో చిన్నగా గొణిగాడు.

చెప్పాడు సింహాద్రి.

"శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ సింహాద్రి మహారాజులుంగారికి ……."

'జై' లతో ఆకాశమంతా దద్దరిల్లిపోయింది !

* * *

"లేస్తారా ? లేవరా ? ఏమిటా మొద్దు నిద్ర మా నాన్న పెద్దమ్మలా ?" అన్నది సింహాద్రి భార్య సీతామహాలక్ష్మి విసుగ్గా విసురుగా.

"లేచి అరగంటయింది…. నీ ముఖం కోసరమే అరగంటపట్టి దుప్పటిలో ముడుచుకు పడుకున్నా!" అన్నాడు సింహాద్రి ఆవలింతను బలవంతాన గుటకలేస్తూ.

"బడాయిలకేం గాని …. త్వరగా లేవండి !" అన్నది సింహాద్రి మాటలకు కాస్త ఉబ్బి నవ్వును మొఖాన రుద్దుకుంటూ సీతామహాలక్ష్మి.

వాకిట్లో సైకిల్ గంట సైరింజన్ గంటలా మ్రోగింది. పాలవాడేమోనని ఇద్దరి మెడకాయలు ఒక్కసారే బయట వైపుకు తిప్పారు—కాదు ! ఎర్ర సైకిల్ ! …. టెలిగ్రాం మనిషి !

సీతామహాలక్ష్మి ఎగిరి గంతేసింది.

"మా రుక్మిణి పెండ్లికూతు రాయనే !" ఎన్నో రాగమో తెలుసుకోలేనంత తొందరగా అనేసి ఒక దీర్ఘం లాగేసింది.

ఆ టెలిగ్రాం ఏమిటో చదవకముందే దాంట్లో సంగతులు ఆ దంపతులకు తెలును !

సీతామహాలక్ష్మి చెల్లెలుకు— స్వయానా సింహాద్రి మరదలకు పెండ్లి లగ్నం పెట్టేశారన్నమాట ! …. మామగారు ఇస్తానని మరీ ఇచ్చిన టెలిగ్రాం అది !

సంతకంచేసి లోపలికి టెలిగ్రాం పట్టుకొచ్చిన సీతామహాలక్ష్మి, మంచం మధ్య కూర్చున్న ఆయన వేలికిస్తూ, "మా శ్రీవారు మహారాజాయెనే !" అని తులో రాగ మాలాపించింది.

"అదేమిటి కొత్త స్లోగాన్ ?" అన్నాడు సింహాద్రి ఆనందాన్ని ఎక్కేస్తూ.

"ఇక ఈ గృహ సామ్రాజ్యానికి మీరేగదా సర్వాధికారులు ! …. ఎన్నాళ్లబట్టో తీరని కోరికాయె! … ఈడేరబోతోంది …. మా చెల్లెలు పెండ్లి గాదు గాని మీకు మహారాజయోగం పట్టింది !" అన్నది. అంతటితో ఆగకుండానే "యోగం పట్టింది గదా అని ఆలాగే ఉండిపోయేరు .. పెండ్లి రేపనగా నైనా తప్పకుండా రండి !" అని మరీ మరీ చెప్పింది.

సింహాద్రి మీసం మెలేశాడు లేకపోయినా ఉన్నట్లుగా !

* * *

సీతామహాలక్ష్మిని రైలెక్కించి వచ్చి నడిమింట్లో నిలబడి పురి విప్పిన నెమలిలా నాట్యం చేశాడు. సిలోన్ పెట్టుకొని వంత పాడాడు. ఆ సంతోష సమయంలోనే హొటల్‌కు వెళ్లి రెండు ప్లేట్ల స్వీట్లు లాగేశాడు. కాఫీ అడిగితే లేదన్నాడని కోప మొచ్చి ఓవోమాల్టు త్రాగాడు.

ఇంకెందుకు లె—బాబోయ్ …. ఒకటా ? …. తన యిష్టం మొచ్చినంత స్వేచ్ఛగా తిరగవచ్చు, రెండో ఆట సినిమాకు వెళ్లి రెండున్నరకు ఇంటికి రావచ్చు. రేడియో సిలోన్ పెట్టుకోవచ్చు, అన్ని ట్లోనూ పెద్దుల్లిపాయల ముక్కలు పెద్ద పెద్దవి వేసుకోవచ్చు …. అంతదాకా ఎందుకు ఇంట్లో గూడా దర్జాగా సిగరెట్టు తాగేయొచ్చు ….

అసలు ఈరోజున స్వయంగా జీవితంలో ఫస్టున 'ఫస్టుగా' వంట చేసేయాలి ….

తను సీతామహాలక్ష్మిని పెండ్లిచేసుకున్నాడన్న మాటేగాని— చేసుకునేముందు వీసమెత్తయినా కనుక్కున్నాడా ?—వంట వచ్చా లేదా అనటా అని !

అబ్బే—నాన్నతో వెళ్లి గుప్పెడు మల్లెలు తల్లో తురుముకొని ముద్దబంతిపువ్వులా కూర్చున్న సీమలక్ష్మిని చూచి, నాన్న 'నీకు నచ్చిందిరా ?' అని అడగటం ఆలస్యం, గుమ్మటంలా, గంగిరెద్దులా తల వూగించాడు.

కాని పెండ్లయిం తరువాత తెలిసింది తను ఎంతగా మోసబోయాడో .. . ఆటు అయిన మావగారు, అత్తగారు కలసి తనని ఎలా నరకంలో దించారో …. ఇంతపెద్ద వాలుజడ షోగ్గా వేసుకుంటుం దెందుకు …. బుద్ధి లేకపోతే సరి ! …. వంట చేతకాకపోగా !

గతపు ఆలోచనలలో పడి యిలా ఈదుతుండగా పక్కింటాయన మొగుడు కాస్త గృహప్రవేశం చేసి, "పాపం ! సింహాద్రిగారూ ! మీవారు పుట్టింటికెళ్లారటగా ?" అన్నాడు.

సింహాద్రికి తాడిచెట్టంత కోప మొచ్చింది— తనకు అది 'వారో' దానికి తను 'వారో' తెలుసుకుండేటంత వరకు ఆయన్ను దులిపేయా లనుకున్నాడు గాని, మళ్లా సీతా మహాలక్ష్మికి కోప మొస్తుందేమోనని (ఎట్లాగైనా ఆమె ప్రియ స్నేహితురాలి మొగుడు గదా !!) అంతదాన్ని మ్రింగేసి 'హిహిహీ' అన్నాడు—ఏదో ఆయన వేసిన విట్టుకి తను నవ్వినట్లుగా !

ఆయనా గబుక్కున నవ్వి, ఆపేసి—"మా ఆవిడ మీకు మరీ మరీ చెప్పమంది—ఈ నాల్రోజులు మీరు మా యింట్లోనే భోంచేయాలని !" అన్నాడు.

"ఏడవలేక పోయాడు మొగతనంలేని వెధవ !" అనుకొని పైకి మాత్రం, హీ—హీ—హిహి— ఎందుకండీ ! …. ఒకరోజా పాడా ?" అన్నాడు నసుగుతున్నట్లుగా.

"కాదు మాష్టారూ !"

"అబ్బే ! లేదు మాష్టారూ !"చేతులతోపాటు మెడకాయ బలంగా తిప్పాడు సింహాద్రి.

ఆయనేమనుకున్నాడో ఏమో చటుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు.

సింహాద్రి తలవంచి టైం చూసుకున్నాడు. సరిగ్గా పది గంటలయింది !

ఇక వంట ప్రారంభిస్తే గంటలో పూర్తి చేయవచ్చు. రాజాలా పది గంటలకల్లా అమోఘమైన వంటకాలతో భోజనం చేసేయొచ్చు అనుకున్నాడు స్వగతంలో సింహాద్రి.

వాకిటి తలుపులు దగ్గరకు వేశాడు. ఇస్త్రీ లుంగీ విప్పేసి మాసిన లుంగీ కట్టుకున్నాడు. చొక్కా విప్పి బనీనుతోటే వంటయింట్లోకి నడిచాడు గాని, అప్పటికి సిగరెట్టు తాగి చాలా సేపయింది అని గుర్తుకురాగా గదిలోకి వచ్చి వరసగా పది దమ్ములు లాగేసి వంటింట్లో పడ్డాడు.

కూరలబుట్ట చూస్తే చాలా రకాలున్నయి. వంకాయ కూర చేద్దామా, బెండకాయ వేపుడు చేద్దామా అని ఆలోచనలో పడ్డాడు. బెండకాయ వేపు డనుకొనేటప్పటికి ముక్కు ఎగిరెగిరి పడింది— కాని అది బహు తేలిక వంట అనిపించగా—బంగాళ దుంప కూరని చివరికి నిర్ణయించుకున్నాడు !

సరే ! బియ్యం ముందు పొయ్యిమీద పడేద్దామనుకొని ఒక్కసారే కడిగి (విటమిన్లు కొట్టుకుపోతాయేమోనని భయపడి) వెలిగించిన స్టౌమీద పడేశాడు.

అటకమీద పెట్టిన కత్తిపీటను తీసి దుమ్ము దులిపాడు. బంగాళ దుంపలు కడిగి (!) చిన్నచిన్న ముక్కలుచేసి గిన్నెలో పడేశాడు.

అట్టి ఉద్భుత సమయంబులో శ్రీమాన్ సుబ్బరాజులుంగారు ప్రవేశించి, "వత్సా ! శుభవార్త వింటిని …. ఈనాటినుండి యువకులకు నీ గృహంబు కేంద్రంబుగా చేసితివట !…. చతుర్ముఖ పారాయణంబునకు ప్రారంభోత్సవ మెన్నడు ?" అన్నాడు.

"నాయినా ! నే నెన్నడూ అనలేదు ఆమాట ! మా శ్రీమతిగారు వచ్చి పేకముక్కగాని, సిగరెట్టు ముక్కగాని చూచిందంటే నా పీకే నొక్కును . కనుక తమరు ఇక దయచేయవచ్చు !" నమస్కారం చేసల్లా మరీ.

"ఆరేయ్ ! …. అదేమిట్రా …. మిత్రుడివి గదా అని, కాదనవని, అంత దూరం నుండి నమ్మకంతో పడి వస్తే, అంత మాటంటావురా …. ఒరేయ్ ! సింహాద్రి—అది కాదురా …. మాకు ఇంత బాధ ఉండేది గాదురా …. ఆ వెంకటేశ్వర్లుగాడి పెండ్లాం లేదూ . . పదిహేను రోజులకు గాని రానని పుట్టింటికెళ్లి ఐదు రోజుల్లోనే తిరిగొచ్చిందిరా … టైం ఉందిగదా అని మేం మరో హెడ్‌క్వార్టర్స్ వెతుక్కోకుండా ఉన్నాం …. ఆమె రాక మామీద పిడుగుపాటయిందనుకో .. . యేరోయ్ ! ఇవి చేతులు గావురా నాన్నా ! …. నాలుగు రోజులు ఒప్పుకో రా .. అరేయ్ సింహాద్రీ ! నాన్నా ! బాబూ ! …. మీ శ్రీమతి వచ్చేదానికి ఒకరోజు ముందుగానే మకాం మార్చేస్తాంరా . . పేకముక్కగాని, సిగరెట్టు ముక్కగాని కనబడకుండా ఏరేసే బాధ్యత వాది …. ఆ….

"ట్టింత మిత్రుడివి నీవే ఇలా అంటే ఇక మాకెం దిక్కురా ...." అని ఏడ్పుమొఖం పెట్టేశాడు.

సింహాద్రికి పాపం జాలేసింది. అప్పటికీ ఏదో అనగబోయాడు గాని, ఏడు తగ్గటం చూచి సుబ్బరాజు బయటకు చూస్తూ "అరేయ్ ! వెంకటేశ్వర్లు, శేషగిరి, రామనాథం .... రాండ్రా .... సింహాద్రి ఒప్పుకున్నాడ్రోయ్ !" అంటూ పెద్దగా అరిచాడు.

ఇంక ఆతటితో సింహాద్రి కాదనలేక, వస్తున్న వాళ్లను చూచి వంట యింట్లోకి తప్పుకుంటూ "అరేయ్ ! సుబ్బరాజు .... ఇటు రారా !" అన్నాడు.

సుబ్బరాజు లోపలికొచ్చి తల వంచాడు 'ఏమిటి ఆజ్ఞ' అన్నట్లు !

"ఏం లేదురా ... మరేవనుకోకు . డబ్బులు పెట్టి మాత్రం ఆడొద్దు..... తరువాత ఏదన్నా అయితే ...."

"అబ్బెబ్బే .... లేదులేదు !" వాడు మెడకాయ యిడా పెడా తిప్పాడు. "మేం పెద్ద ఆటగాళ్లం కాదురా .... మహా ఏడిస్తే ముండమోపిది రెండు పైసలు .... ఆఁ .... నీవేం భయపడబోకు .... నే మున్నానుగా .... నీకు మాట రానిస్తానా ?" అంటూనే అవతల గదిలోకి పరుగెత్తాడు.

వంటయ్యేటప్పటికి రెండు గంటలు పట్టింది. ఆరోజు శెలవవ్వటంతో పన్నెండు గంటలకల్లా భోజనం పూర్తి చేశాడు—వంట రోజూ తినేదానికంటే బ్రహ్మాండంగా ఉన్నట్లే అనిపించింది—కాకపోతే ఆలోచనలలో పడటంతో బంగాళదుంప కూర క్రింద అట్టుగట్టింది. పులుసులో చింతపండు తగ్గినట్లున్నది .... అన్నం వార్చటం మర్చిపోయినట్లున్నాడు— ఎట్లాగైనా స్వయంపాకం సీ మహాలక్ష్మి వంటకంటే గూడా అమోఘంగా ఉన్నట్లే అనిపించింది. వదిలిపెట్టకుండా మొత్తం గిన్నెలన్నీ ఖాళీచేసి 'బ్యార్' మంటూ బయటికొచ్చాడు.

సుబ్బరాజు పక్క గదిలో నుండి హడావుడిగా బయటకు వచ్చి, "అరేయ్ ! ఒక రూపాయి ఉంటే ఇవ్వరా ! సాయంత్రం ఇస్తాను !" అన్నాడు.

సింహాద్రికి చర్రున కోప మొచ్చింది— ఏదో శేస్తే ఏదోలాగా .... వెధవలను తను తెలివితక్కువగా లోపలజేర్చుకున్నాడుగాని—"చచ్చి గీ పెట్టుకున్నా నా దగ్గర నయాపైసా లేదు .... ఆఁ ! ...." అని మరీ చెప్పేశాడు.

# మహారాజయోగం

"అది గాదురా ! ఆటలో వాళ్ళు అప్పు పెట్ట గూడదనేది మా ధీరీరా ! .... అంతకంటే ఏంలేదు !" నసిగాడు.

"ఏదైనా సరే .... పిచ్చి వేషాలు మాత్రం వేయబోకు !"

సుబ్బరాజు ఏదనుకున్నాడో ఏమో భారంగా ఐదు నిట్టూర్పులు విడిచి గదిలోకి వెళ్లిపోయాడు.

తరువాత ఆ గదిలోకి సింహాద్రి వెళ్లినప్పుడు నిజంగా సుబ్బరాజును చూచేటప్పటికి జాలేసింది . ఒక ప్రక్కన అన్నీ పోగొట్టుకున్న వరదబాధితుడిలాగా తల వంచుకు కూర్చుని దీనంగా మిగతావాళ్ల ముందున్న డబ్బుల్ని చూస్తున్నాడు !

సింహాద్రి కరిగిపోయి రూపాయి ఇవ్వబోయాడు గాని హృదయం నాలుగు తిట్టి జేబులోని చేతిని బయటకు లాగేసింది!

ఇవాళ దర్జాగా మ్యాటనీకి వెళ్దామను కున్నాడు .... ఎప్పుడో చిన్నప్పుడు (పెండ్లి కాకముందు) కాలేజీ ఎగగొట్టి వెళ్లేవాడు సర్దాగా.

వంటిగంటకు పేకాటగాళ్లు ఆవలించుకుంటూ బయటకు వచ్చారు.

అరేయ్! సింహాద్రి! ఇప్పుడే మళ్లా ఓ అర గంటలో వచ్చేస్తాం .. భోజనం చేయటం ఆలస్యం ... ఆఁ .." అన్నాడు సుబ్బరాజులు.

"నాయనా ! కొంపలేం అంటుకోవుగాని . . . సావకాశంగా నాలుగు గంటలకు రండి !" అన్నాడు తను ఆ సమయానికి తాళమేసి ఎట్లాగో సినిమాకు వెళతాడు గదా అని !

"అరేయ్ ! అది కాదురా !" వాడు నసుగుతున్నాడు.

"అదిగాదు ..ఇది గాదు . ముందు గెట్ అవుట్ !"

సుబ్బరాజు సింహాద్రి అరుపుకు బిక్కచిక్కిపోయి "సింహాద్రి డామాల్లోకి పనికొస్తాడ్రోయ్ . హి హి హీ' అని, 'సరే లేరా !' అని గూడా వెళ్లిపోయాడు.

మరో ఇల్లు గొరికేటంత వరకు ఏమైనా వదాలి మరి !

సింహాద్రి నడుం వాల్చాడు మంచం మీద వాపోలు లెక్కేస్తూ (క్షమించాలి—ఏదో అనాలి గాబట్టి అన్నాను గాని—నిజానికి అది శ్లాబ్ కొంప !)— ఈ నాల్రోజులు జీవితంలో మర్చిపోలేని దినాల్లా గడపాలనిపించింది—మరెన్నడూ జీవితంలో పొందలేని ఆనందాన్ని ఈ నాల్రోజుల్లోనే మరీ రంగరించి త్రాగెయ్యాలని నొక్కి నొక్కి అనుకున్నాడు

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియలేదు గాని .... నిద్రలో గూడా మంచి మంచి కలలే వచ్చినయి—కొంతసేపు ఒంటరిగా కాశ్మీర్‌లు తిరిగాడు.... తరువాత తాజమహల్ చూస్తుండగా ప్రక్కన సీతామహాలక్ష్మి కనబడగా భయంపుట్టి పరుగెత్తాడు గాని, మరు క్షణంలోనే హంపీలు ఉండటంతో అంతకు క్రితంది కలలే అని చప్పరించేశాడు !

అలాంటి మధుర క్షణాలలో సింహాద్రి తేలియాడుతున్న సమయంలో—

గోడనున్న గడియారం రెండు కొట్టింది.

తలుపుమీద ఎవరో దబదబా బాదసాగారు.

సింహాద్రి తన కలలను చెరిపిన రాక్షసుల్ని తిట్టుకుంటూ, (సుబ్బరాజు వెు॥) మొఖం చిట్లించుకుంటూ మరీ తలుపు తీశాడు.

"ఏరా సింహాద్రుడూ ! నీకూ పగటి నిద్ర పట్టిందన్నమాట ! ." అని పెద్దగా నవ్వేసి మరీ లోపల కాలు పెట్టాడు. ఆయన—అరవయ్యేళ్ల వృద్ధుడు—శ్రీమాన్ సింహాద్రులుంగారికి సాక్షాత్తూ పెద్దనాన్న !

సింహాద్రి కొయ్యలా బిగుసుకుపోయాడు.

ఈ సమయంలో తన కొంపకి చుట్టాలా ?— అందునా అతి చాదస్తుడైన తన పెదనాన్నా ?

ఘోరం !—ఇదేరా కలికాలం అంటే అని గూడా నెత్తీ నోరూ కొట్టుకున్నాడు మనస్సులోనే.

ఆయన వచ్చిన రెండు క్షణాలలోనే నాలుగు గదులూ చుట్టేసి, "ఏదిరా కోడలుపిల్ల ఎక్కడా కనబడడంలేదు ?" అన్నాడు.

"నా పిండాకూడు !" అందామనుకొని, "అది గాదే పెదనాన్నా !... వాళ్ల చెల్లెలు పెళ్లయితే పొద్దునే వెళ్లింది !" అన్నాడు.

"మరి నీ వెళ్లలేదేవిట్రా ?" సాగదీశా రాయన.

"శలవా గట్రా దొరకాలగదే !" నసిగాడు.

"అరేయ్ ! సింహాద్రుడూ ! కాస్త ముందు మజ్జిగ ఎక్కువుంటే ఇచ్చి, కాస్త అన్నం ఉడకేసి పడేస్తే ఉప్పూ కారం నలుపుకు తినేస్తాను ... నిన్న పొగున తిన్నన్నం .... గుంటూరులో మీ పిన్నమ్మ ఉడకేసి పడేస్తే రెండు మెతుకులు గతికొచ్చాను. నా ఖర్మ కాకపోతే అవుతుం దనుకున్న పని అవకుండా పోవాలా ... నాకు ఈ ఉపవాసం గతి పట్టాలా ? ... త్వరగా లేచి రెండు మెతుకులు ఉడకేశావో ... నోట్లో పారేసుకుని బండెక్కేస్తాను .... అయినా కోడలుపిల్లను చూచి చాలారోజు లయిందిగదా అనుకున్నాను .... నేను చాలా రోజు లయిందిగదా ఇటుపక్క కొచ్చి .... అరేయ్ ! .... అది ఇంతకీ ఒక పసికూన నన్నా ఎత్తుకుందా ? .... ఆఁ . . "దీర్ఘం లాగాడు.

భోంచేయగానే పోతానన్న మాటలకు ఉబ్బి తబ్బిబ్బవుతున్న సింహాద్రి, "ఆఁ ఆఁ .... లేకేం ....



ఆడపిడపిడపి పక్కింటివాళ్ల గీతను ఎత్తుకుంటూనే ఉంటుంది !" అన్నాడు.

ఆయన పగలబడి నవ్వారు. "అది గాదురా పిచ్చి వన్నాసీ ! .... కోడలుపిల్ల నీళ్ళేవయినా పోసుకున్నదా అవటా అని అడుగుతుంటే .... ?" ఆయన నవ్వుకు ఫుల్‌స్టాపే దొరకలేదు.

సింహాద్రికి అర్థంగాక బిత్తరబోయాడు.

"నీళ్లేం ఖర్మ .... పదిహేను రోజుల క్రితం వాళ్లక్కయ్య వచ్చినప్పుడు తలంటించుకొని మరీ పోసుకుంటే!" అన్నాడు మరీ అమాయకంగా ముఖం పెట్టి. "అరేయ్! సింహాద్రుడూ! .. మీనాన్న కడుపున నీవు తప్పబుట్టావురా ! .... సరే సరే .... పోయి ఆ మెతుకు ఉడకేయ్ !" అని తువ్వాలు వేసుకు కూర్చుని, "అరేయ్ ! సింహాద్రుడూ .... మీ పిన్నమ్మ ఏఁవంటుందో తెలుసా .... ?" అంటూ మధ్యలోనే ఆపేసి హడావుడి పడుతూ, "కాస్త పట్టు బట్టన్నా కట్టుకు ఉడకెయ్యరా బాబు !.... ఆ మయిల కూడు నే నెలా తినేదిరా ?" అన్నాడు.

"పట్టుబట్ట లేదే పెద్దనాన్నా .... దాని బదులూ నాన్న పెళ్లిలో డబ్బే తీసుకున్నాడుగదే !"

"నా శ్రాద్ధం ! .... పట్టుబట్టలేకపోతే .... తువ్వాలు తడిపన్నా కట్టుకోరా !"

సింహాద్రికి చచ్చినంత పనయింది.

ఏం చేస్తాడు—ఏనాడు చేసుకున్న పాపమో అను కొని తువ్వాలు తడిపి, పిండి మరీ కట్టుకున్నాడు. చలి జివ్వున లాగుతుంటే కుంపటిముందు వినురుతూ కూర్చున్నాడు.

"అరేయ్ ! సింహాద్రుడు !.... ఈలోగా ఒక్క కునుకు తీస్తానుగాని అన్నం అవ్వగానే లేపు !...." అంటూనే అన్నంతసేపు గూడా ఆగకుండా నిద్రలో పడిపోయాడు.

సింహాద్రికి మరో భయం పట్టుకుంది— ఈ పేకాట పక్షులు ఎక్కడ వాలతారోనని !.... వాళ్ళనుగాని ఈయన చూచాడో .... వాళ్లది ఎట్లా ఉన్నా తన చర్మం వూడదీసి డోలు కట్టేస్తాడనేది ఖాయం !

"భగవంతుడా ! ఈ సింహాద్రికి ఎన్ని కష్టాలు పెట్టావురా ?"...అనుకున్నాడు. ఆ పాడు శెలవేదో పుచ్చుకొని తనూ పెండ్లికి వెళ్లివుండవల్సింది !

"నాయనా ! కష్టాలు మానవులకు రాక మానులకొస్తాయా ? ...కష్టాలను ఎదుర్కొంటేనే మానవుడు రాటుదేలగలడు !.... ఏఁవైనా చేయగలడు .... హిమాలయ పర్వతా లెక్కగలడు !" ఎవరో అన్నట్లు వినిపించగా కోపమొచ్చి విసనకర్రను దబదబా బాదసాగాడు.

ఈయన మోతకు ముసలాయన లేచి, "ఏరోయ్ ! సింహాద్రుడూ !.... వంటయిందేఁవిటి ? అన్నారు ఆశగా.

"కుంపటే వెలగందే !" గొణిగాడు.

ఆయన పాపం ఒక నిట్టూర్పు విడిచి మెదలకుండా మళ్లా పడుకున్నాడు శోష కొచ్చినవాడిలా.

తరువాత బియ్యాన్ని మెతుకుల్లా (అక్కడక్కడా మేకుల్లా) మార్చేటప్పటికి అరగంటకు పైగా పట్టింది.

ఆవురావురుమంటున్న ఆయన కాస్త, సింహాద్రి మాట వింటం ఆలస్యం. లేచి తడిగుడ్డ కట్టుకొని భోంచేసి, తరువాత పది నిముషాలకు పొడిగుడ్డ కట్టుకుని మరీ త్రేన్చొక్కాడు






# అమృతాంజన్
లిమిటెడ్ వారి
# గ్రైప్ మిక్స్చర్

తయారీ:
అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4

FDS AGM 472-TE

---

ఎన్నో రకముల
యింట్లో వాడుకొనే **క్లియర్‌టోన్** ఉపకరణములు **Kleertone**


రేడియంట్ హాట్ ప్లేట్


ఇంపీరియల్ ఇస్త్రీపెట్టె


ఇంట్లో వాడుకొనే ఇస్త్రీపెట్టె


కెటిల్


టోస్టర్


టేబుల్ మరియు సీలింగ్ పంకాలు



ఎలెక్ట్రిక్ గడియారం


మడతపడే స్టీల్ ఫర్నిచరు

*క్లియర్‌టోన్ డీలర్లవద్ద మరియు నేషనల్-ఎకో డీలర్లవద్ద లభిస్తున్నాయి. ఇంకా యీ క్రింది ఎడ్రసువద్దకూడ లభిస్తున్నాయి:*

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్

బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . బెంగుళూరు . సికిందరాబాదు . పాట్నా

**GRA**

JWTGRA-2804 (A)

# మహారాజయోగం

ఒక పెద్ద గండం గడిచి బయట పడ్డట్టుగా కొన్నేవు బుజాలు రెండూ అద్దంలో చూచుకుంటూ దులుపుకొని బయటకొచ్చిన సింహాద్రికి, డాబా మీదనుండి మాటలు వినిపించగా ముందుకువచ్చి తలెత్తి చూచాడు.

అవి సుబ్బరాజు మాటల్లా ఉన్నాయి! పక్క వైపుకు చూస్తే నిచ్చెన వేసిఉంది.

అనుమాన మొచ్చి నిచ్చెనమీదగా పైనెక్కి చూచాడు.

ఏంవుంది!— వాళ్ళు దీర్ఘంగా పేకాడుతున్నారు!

"అరేయ్!.... ఇదేవిట్రా ఇక్కడెక్కారు?" అడిగాడు ఆశ్చర్యపోతూ—తన పెదనాన్న ఉండగా క్రిందకు రానందుకు సంతోషిస్తూ.

"ఇందాక కుంపటి విసురుతున్న నీ మొఖం చూస్తే కాలిన పెనంలా ఉంది—అందుకని నిన్ను కదిలిస్తే కరుస్తావేమోనని మెదలకుండా ఇక్కడో నిచ్చెన కనబడితే పైకెక్కి ఆడుకుంటున్నాం!" అన్నాడు జాలిగా సుబ్బరాజులు.

"ఏడ్వలేకపోయావు .... క్రిందకు రండి!" అన్నాడు సింహాద్రి.

వాళ్ళు బిలబిలా, తల్లి ననుసరించే కోడిపిల్లల్లా, సింహాద్రి ననుసరించి నిచ్చెన దిగారు.

పొద్దుగూకే టప్పటికి సింహాద్రి కేదో నీరసం పట్టుకుంది. ఇవాళ ఎవరి మొఖం చూస్తూ లేచాడో గాని తను—అనుకున్న ఒక్కపనీ చేయలేదు... కాక పోంగా రెండు గంటలకు పిండాకూడొండే మరో తద్దినం తగులుకుంది.

రేపు ఇక సరేసరి— రోగిష్టిమారి పెళ్ళాంలా పీక్కుతినే ఆఫీసు!

మంచంమీద నుంచి లేవ బుద్ధికాలేదు.

కాళ్ళు లాగుతుంటే అక్కడే పడుకున్నాడు. ఆరు గంటలకు ఇక లేవక తప్పలేదు. లేచి బియ్యం కడిగి కుంపటిమీద పడేశాడు. డబ్బా లోంచి వడియాలు తీసి కాలే నూనెలో వడేసి, నల్లబడిందాకా తిప్పాడు. పైనించల్లా ఆవకాయ జాడీ దింపి ఒక గరిటెడు కంచంలో వేసు కున్నాడు!

భోజనం అయిందనిపించేటప్పటికి ఎనిమిదిగంట లయింది.

సుబ్బరాజు తరువాత కొద్ది క్షణంలోనే బయట కొచ్చి, సింహాద్రితో "మళ్ళా ఇంకో గంటలో వస్తాం!" అన్నాడు.

సింహాద్రికి ఈసారి ఇంకాస్త పెద్ద తాడి చెట్టంత కోప మొచ్చింది. "ఇదేవన్నా క్లబ్బను కున్నారా లేక ... ఆఁ .... ఆఁ .... ఆఁ." తరువాత మాట దొరక్క మింగేసి, "రేపు సాయంత్రం దాకా పేక అన్నారో కాళ్ళిరగ్గొట్టేస్తాను!" అన్నాడు.

సుబ్బరాజుకి ఏడుపొచ్చినంత పనయింది. ఆత గాడి సర్వీసులో ఇట్లాంటి కొంప ఎక్కడా చూడ లేదు!

కోపాన్ని లోపలే మింగేసి, ఏడుపును కక్కేస్తూ కాళ్ళమీద పడ్డంత పనిచేసి, "అయితే ఇంకో గంట పేక ఆడుకొని ఒకేసారి వెళతాం!" అన్నాడు ప్రాధేయపడుతూ.

సింహాద్రికి జాలి ఆగలేదు. "సరే! పోండి!" అన్నాడు.

ఆరోజు అలా గడిచిపోయింది ..... ఆరోజు ఏవేవో పొడిచేద్దా మనుకున్న సింహాద్రి ఏవీ పొడవలేక పోయాడు. తరువాత మూడ్రోజులూ అంతకంటే ఘోరంగా గడిచిపోయినయి.

రెండోరోజుతోనే వంట ఒక వెధవ తద్దినంలా అనిపించింది. కుంపటిని అట కెక్కించేసి హోటల్ భోజనం చేయటం మొదలుపెట్టాడు. సీమా లక్ష్మికి గూడా చెప్పగూడ దనుకున్నాడు. (నామర్దా చేటు!)

ఇది ఇలా ఉండగా— మాటిమాటికి సీతామహా లక్ష్మితో గడిపిన మధురక్షణాలు గుర్తుకురాగా దిగులుపడిపోయి చిక్కిపోయాడు— మూడు పైస లిచ్చి రోడ్డు ప్రక్కన తూకం తూయించుకుంటే పదిహేను పౌన్లు తగ్గినట్లే అనిపించింది.

మూడోనాటికల్లా పదిహేను రోజులకు పెరిగి నంత గడ్డం పెరిగినట్లనిపించగా, తలకాయిని ఒక

భార్యాభర్తలు చంటి పిల్లాడితో సినిమాకి బయల్దేరారు. థియేటర్ మేనేజర్ వాళ్లని గేటు దగ్గర ఆపాడు.

మేనేజర్: మీరు హాల్లోకి రావచ్చు కానీ మీ పిల్లాడు ఆట మధ్యలో ఏడ్చి నలుగురికీ బాధ కలిగిస్తే నేను మీ డబ్బు మీ కిచ్చి బయటి కెళ్లమని చెప్పాల్సి వస్తుంది.

కొంతసేపైన తర్వాత—

భర్త: సినిమా ఎలా ఉంది?

భార్య: ఏం బాగా లేదు. విసుగొస్తుంది.

భర్త: అయితే అబ్బాయిని ఎడిపించు.

ఎం. పురుషోత్తంనాయుడు (మద్రాసు)

పావుగంట మంగలిషాపులో పెట్టి మరీ అర్ధ రూపాయి యిచ్చి వదిలించుకొచ్చాడు.

ఒక్కొక్క క్షణంలో తన స్వయంపాకం గుర్తుకు రాగా సీమాలక్ష్మి వంటే అత్యద్భుతంగా ఉన్నదని పించింది (చచ్చినా పైకి కనగూడదని గూడా అను కున్నాడు!)

అత్తగారింటి కెళితే మహారాజులా, కాలు క్రింద పెట్టకుండా జరిగిపోయేది. (మావగారి కాలంనాటి పదడుగుల ఎత్తు పందిరి మంచంమీద బిచాణా బిగిస్తే దిగాల్సిన అవసరమే ఉండదు.)

నాలుగోరోజు సాయంత్రం అయ్యేటప్పటికి తాను పెద్ద బుద్ధితక్కువపని చేసినట్టుగానే నిర్ణ యించుకున్నాడు. మాటమాటకు చెంపలు వాయించు కున్నాడు. ఇంకెప్పుడూ సీమాలక్ష్మిని వదిలి ఉండ కూడదనే అనుకున్నాడు— అసలు సీమాలక్ష్మి పొడు గైన వాలుజడ ఎంత బాగుంటుందో ఆమె వంటా అంతే బాగుంటుందని నొక్కినొక్కి వక్కాణించు కున్నాడు.

వీటన్నిటికి తోడు పులిమీద పుట్రలాగా క్రితం రోజు సాయంత్రం నుంచి చెవికోసిన కోతిలా వో నల్లకాకి దొడ్లో పడి ఒకటే అరుస్తోంది!— దాంతో సింహాద్రికి భయం గూడా పట్టుకుంది.

రేపు అత్తగారింటికి వెళ్ళొచ్చిం తరువాత ఒక సంఘాన్ని స్థాపించి 'మొగవాళ్ళు వంట చేయటం అంటే ఎంత పెద్ద తద్దినమో' వరుసగా వారం రోజులు ఉపన్యాసాలు గూడా ఇప్పించి, తమాయిద్దా మనుకున్నాడు.

అసలు అన్నింటికంటే మహా ఘోరం ఈ పేకాట గాళ్ళది— ఆ సన్యాసులకి ఇంట్లో ఆడటం అంటే యమధర్మరాజుతో ఆడటమే .... పెండ్లాం తిట్లకు తడిసి ఎవడి పెండ్లాం ఎప్పుడు పుట్టింటికి వెళు తుందా అని భూతద్దా లేసుకు వెతుకుతుంటారు!

ఇక చచ్చినా ఇటువంటి పొరబాటువని మాత్రం చేయగూడ దనుకున్నాడు. (దానికి తోడు ఈ నెల్లో కరెంటు బిల్లు పది రూపాయ లయ్యేలా ఉంది— రేపు సీమాలక్ష్మికి ఏం సంజాయిషీ ఇచ్చుకోవాలో?!)

ఆఫీసవ్వగానే నాల్రోజులు శెలవిచ్చిన ఆఫీసర్ని తన పూజామందిరంలో పెట్టుకుందాం అనుకుంటూ మరి పరుగెత్తుకుంటూ ఇంటి కొచ్చాడు. ఎడారిలో ప్రయాణం చేస్తున్న ప్రయాణీకునికి ఒయాసిస్సు కనబడితే పరుగెట్టినట్టుగా బెడ్డింగ్ తీసు కొని స్టేషన్‌కు పరుగెత్తాడు.

రైలొచ్చింది.

ఎక్కి కూర్చున్నాడు.

—అటువంటి సమయంలో స్టేషన్ బయట నుండి పరుగెత్తుకొస్తున్న సుబ్బరాజుల్ని చూసి గుండాగినంత పనయింది సింహాద్రికి.

"పేకాడుకోవటానికి ఇంటి తాళంచెవి ఇవ్వ మనడు గదా ఖర్మ!"

త్వరత్వరగా లేచి సామాన్లు పెట్టె చెక్కమీది పడుకుందా మనుకున్నాడు గాని లేచి పైకెక్కబోయే లోగానే సుబ్బరాజు కిటికీలోంచి 'ప్యాంటు' పట్టు కొని కంగ్రాచ్యులేషన్స్‌రోయ్!" అన్నాడు.

సింహాద్రికి అర్థంకాలేదు. మంచునే తల క్రిందకు వంచాడు.

సుబ్బరాజు చెప్పుతున్నాడు. "ఆ విశ్వనాథం గాడు లేడు .... అట్లా వెర్రిమొఖం వేస్తావేంరా.... మన సెక్షన్ సీ టు రా .... వాడి పెళ్ళాం నీళ్ళాడ టానికి పుట్టింటి కెళ్ళిందట! .. ఆరునెల్ల దాకా తిరిగి రాదట .... ఇక మా కరువు తీరా ఆడుకో వచ్చులే ... వస్తా!.... ఆఁ .." అంటూనే వెళ్ళి పోయాడు.

సుబ్బరాజు వెళ్ళినవైపే నోరు తెరుచుకొని చూస్తుండిపోయాడు సింహాద్రి.

తరువాత ఎంత ఆలోచించినా సుబ్బరాజు 'కంగ్రాచ్యులేషన్స్' ఎందుకు చెప్పాడో అర్థం గాక పోవడంతో, వెళ్ళొస్తానన్న వాడికి 'థాంక్స్' చెప్పి నట్టుగా ఉన్నట్టు అనిపించగా నవ్వుకున్నాడు సింహాద్రి.

గార్డు విజిల్ వూదాడు.

రైలింజన్ కూత కూసింది.

సీమాలక్ష్మి దగ్గరకు పరుస్తున్న రైలుకు 'థాంక్స్' చెబుతూ హుషారుగా సిగరెట్టు దమ్ము లాగాడు సింహాద్రి. 

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥

# వేల్పులకైనా మార్పులు తప్పవు

# విష్ణువు

మహేష్

హైందవ దేవతాగణంలోని అగ్ర దేవతాత్రయంలో విష్ణువు ఒకడు. ఈ దేవునకు విష్ణువు, నారాయణుడు, వాసుదేవుడు, కృష్ణుడు మొదలైన పేర్లు ఉన్నాయి. మొదట ఈ పేర్లలో ఒక్కొక్క దానితో ఒక్కొక్క దేవుడు పిలువబడే వాడనీ, క్రమంగా ఈ అందరు దేవుళ్లను చేర్చివేయగా నేటి విష్ణువు ఏర్పడినాడని చాలా మంది పండితులు అభిప్రాయపడుచున్నారు.

ద్రావిడుల ఆకాశదేవత, ఆర్యుల సూర్యదేవత కలిసి నేటి విష్ణుభావనకు దారితీసినాయి. ద్రావిడ భాషలో విన్ అనగా ఆకాశమని అర్థం ఇదియే విష్ణువుయొక్క నీలవర్ణమునకు కారణమై ఉండవచ్చును. విష్ణుశబ్దము ప్రాకృత భాషలో విన్హుగా పలకబడుతుంది. ద్రావిడ భాషలో కన్నన్‌గా పిలువబడే కృష్ణుడు, ఇంద్రుని ఎదిరించిన రాక్షసుడుగా ఋగ్వేదంలో పేర్కొనబడుచున్నాడు. కృష్ణుడు బాల్యంలో ఇంద్రోత్సవాన్ని ఆపివేయడం మొదలైన వృత్తాంతాలకు ఇదే కారణమై ఉండవచ్చును. కృష్ణుడు నీలవర్ణుడు కాబట్టి పూర్తిగా ద్రావిడుడని కొద్ది మంది ఆధునికులు అభిప్రాయపడుచున్నారు కాని వీరి అభిప్రాయానికి సరియైన ఆధారాలులేవు. రుద్రుడు కూడా నీలలోహితునిగా స్తుతింపబడుచున్నాడు. అందుచేత నీలవర్ణుడయినంత మాత్రమున కృష్ణుడు కేవలం ద్రావిడ దేవత అని చెప్పుట తగదు. ఈ వాదాన్ని అంగీకరించినట్లయితే నీలవర్ణుడుకాని ద్రావిడ దేవత, మురుగన్ ఆర్యదేవత అని భావించవలసి ఉంటుంది. అంతేకాకుండా కృష్ణుని ప్రధాన కార్యమైన గోపాలకత్వం ఆర్యులయందే ప్రసిద్ధిని పొందినదిగాని ద్రావిడుల యందుకాదు. అందుచేత నేటి విష్ణువు కూడా ఆర్యానార్య భావ సంయోగ సంజనితుడని చెప్పుటకు ఆటంకంలేదు.

## వేదాల్లో విష్ణువు

విష్ణువు, నారాయణుడు, కృష్ణుడు మొదలైన పేర్లలో విష్ణువు అనే పేరు ప్రాచీనమైనది. ఋగ్వేదంలో విష్ణువు అంత ప్రాముఖ్యతను వహించలేదు. ఇతడు విశాలమైన దేహము కలిగిన యువకుడు. విష్ణువు ప్రధానంగా "ఉరుక్రముని"గా కీర్తింపబడుచున్నాడు. ఉరుక్రముడు అనగా పెద్ద అంగలు వేసి నడచువాడు అని అర్థం. మూడు అడుగులతో విష్ణువు ఆకాశమున సంచరించుచున్నాడు. రెండు అడుగుల (పాదముల)ను మానవులు చూడగలరుకాని, మూడవ పాదము విహగముల విహార స్థలమునకు కూడపైనుండుట వలన, దానిని చూడలేరు. ఇది ఆకాశ మధ్యమున ఉండి ప్రకాశించుచున్నది. ఇదియే విష్ణువునకు ప్రియమైన నివాసస్థానం. దీనినే పరమపదమని కొనియాడుచున్నారు. ఇక్కడనే దేవతలు, ఋషులు ఆనందమును పొందుచున్నారు.

పురుష రూపుడైన సూర్యుడే విష్ణువుగా మొట్టమొదట భావించబడినాడని చాలామంది పండితులు అభిప్రాయపడుచున్నారు. సూర్యుని ఆకాశగమనమే విష్ణువు ఉరుక్రముని (పెద్ద అంగలువేసి నడచువాడు)గా కీర్తింపబడడానికి కారణం. భూమి, వాయువు విష్ణువుయొక్క రెండు అడుగులనీ, స్వర్గమే మూడవ అడుగనీ, అందుచేతనే మూడవ అడుగైన స్వర్గాన్ని దేవతలు, ఋషులు మాత్రమే పొందుచున్నారని వర్ణించబడడానికి కారణమై ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. ఉదయము, అస్తమయము, విష్ణువుయొక్క రెండు అడుగులనీ, మధ్యాహ్నము మూడవ అడుగు అనీ, అందుచేతనే ఉదయాస్తమయ సమయాల్లో మానవులు సూర్యుని చూచినట్లుగా, మధ్యాహ్న సమయమందు చూడలేకపోవడంవలన మూడవ అడుగును ఋషులు, దేవతలు మాత్రము పొందగలరని వర్ణించ బడడానికి కారణమై ఉండవచ్చునని మరి కొందరి అభిప్రాయం. మూడవ అడుగు ఆకాశమందు నేత్రమువలె ఉండి ప్రకాశించుచున్నదని చెప్పబడిన వాక్యం ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది. సూర్య గమనముచే ఏర్పడిన మూడు వందల అరవై రోజులు కల సంవత్సరమే విష్ణువు నాలుగు పేర్లుకల తొంభై గుర్రాలను చలింపచేయుచున్నాడని వర్ణించుటకు కారణం. విష్ణువు ఇంద్రునకు మిత్రుడై, ఇంద్రుడు వృత్రాసురునితో జరిపిన యుద్ధంలో పాల్గొనినట్లు వర్ణింపబడుచున్నాడు. ఇంద్ర వృత్రాసుర యుద్ధం రాత్రిం బగళ్ళకు సంబంధించిన వృత్తాంతమే అని ఆధునికులు కూడా అభిప్రాయపడుచున్నారు. ఈ



శేషశయనుడైన మహావిష్ణువు (ప్రాచీన చిత్రాన్ని అనుసరించి)



భూభారం వహిస్తున్న విష్ణువు (మహాబలిపురం శిల్పం)

# వేల్పులకైనా మార్పులు

అభిప్రాయం పురుష రూపుడైన సూర్యుడే విష్ణువు అనే వాదాన్ని బలపరుస్తుంది.

విష్ణువే అత్యుత్తముడని ఐతరేయ బ్రాహ్మణం చెబుతుంది. దేవతలందరిలోను విష్ణువు యజ్ఞఫలాన్ని ముందుగా పొందడంవలన విష్ణువు సర్వోత్కృష్టుడైనట్లు శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. ఒక యజ్ఞస్థలంలో దేవతలకు, రాక్షసులకు తగాయిదా రాగా, రాక్షసులు ఒక వామనుని దేహ పరిమితిగల స్థలం మాత్రం దేవతలకు ఇవ్వడానికి అంగీకరించేరు. అప్పుడు, విష్ణువు, వామనుడై భూమిమీద పడుకొని క్రమంగా తన దేహాన్ని పెంచి భూమిని అంతా ఆక్రమించినట్లు కూడా శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది.

## నారాయణుడు

విష్ణువు, నారాయణుడు మొట్టమొదటనుంచీ ఒక్కరుగా భావించబడరేదు. ప్రజాపతి కోరిక మీద నారాయణుడు మూడుసార్లు యజ్ఞము చేసినట్లు శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. ఇందులోనే మరియొకచోట నారాయణుడు పంచరాత్ర వ్రతాన్ని ఆచరించి సర్వాధిక్యతను పొందినట్లు చెప్పబడింది. తైత్తిరీయారణ్యకంలో నారాయణుడు, వాసుదేవుడు, హరి యీ ముగ్గురు ఒక్కరేనని చెప్పబడింది. విష్ణువు, నారాయణుడు ఒక్కరేనని బోధాయన ధర్మసూత్రాల్లో కూడా చెప్పబడింది. తైత్తిరీయారణ్యకం, బోధాయన ధర్మ సూత్రాల్లో బోధాయన ధర్మ సూత్రాలే ప్రాచీనమైనవని భావించబడుతున్నాయి కాబట్టి ఈ ధర్మ సూత్రాల్లోనే మొదటసారి నారాయణుడు, విష్ణువు ఒక్కరుగా గుర్తింపబడుచున్నారని చాలామంది అభిప్రాయం.

నారాయణుని నివాసం శ్వేతద్వీపం అని వర్ణింపబడింది. పాండవులకు తోడ్పడిన వాసుదేవుడే నారాయణుడని మార్కండేయుడు ధర్మరాజుతో చెప్పినట్లు అరణ్యపర్వంలో చెప్పబడింది. జల ప్రళయ సమయంలో యావత్ప్రపంచము తనకుక్షిలో ఉన్నట్లుగా నారాయణుడు మార్కండేయునకు చూపించినాడు. నరనారాయణులని యిద్దరు ఋషులు ఉన్నట్లుగాకూడా కొన్నిచోట్ల చెప్పబడింది. వీరు బదరికాశ్రమంలో తపస్సు చేయుచుండగా, నారదుడు వారిని దర్శించినాడు. నరనారాయణులు దేవతలచేత కూడా పూజించబడ్డారు. వీరు దేవదానవ సంగ్రామంలో యింద్రునకు సహాయం చేసినట్లు వర్ణించబడింది.

ఆ నరనారాయణులే మహాభారతంలోని అర్జునుడు, కృష్ణుడు అని, ఉద్యోగపర్వంలోను అరణ్యపర్వంలోనుకూడా చెప్పబడింది. నరుడు, నారాయణుడు, హరి, కృష్ణుడు అనే రూపాలతో పరమాత్మ జన్మించేడనీ, వీరికి తండ్రి ధర్మం, తల్లి అహింస అని కొన్నిచోట్ల చెప్పబడింది. నారాయణుడనే ఋషి ఉండేవాడనీ, అతడే క్రమంగా విష్ణువుగా భావించి పూజించబడినాడని కొందరి అభిప్రాయం. నారాయణ అనగా నర సమూహాలకు గమ్యమైన స్థానం అనే అర్థం ఉంది. నర అనే పదం వేదాల్లో దేవతలకు కూడా వాడబడింది, అందుచేత నారాయణ అంటే దేవతలకు కూడా గమ్యస్థానం అనే అర్థంకూడా ఉంది. నారాయణుడు సముద్రంలో శయనించి చెప్పబడుతుంది. వీటిని అన్నిటిని బట్టి చూడగా పరమాత్మనే నారాయణునిగా భావించేరనీ నారాయణుడు అనే పురుషుని బట్టి యీ భావన కలగలేదనీ, శ్రీభండార్కర్ అభిప్రాయపడుచున్నారు. విష్ణువు యొక్క 39 అవతారాల్లో నరనారాయణులు 31, 32 వ అవతారాలుగా వర్ణించబడ్డారు.

## వాసుదేవ కృష్ణుడు

విష్ణువు మొదటనుంచీ దేవుడుగానే భావించబడుచున్నాడు. నారాయణుడు దేవుడే అని కొందరు, ఆపేరుగల ఋషి ఉండేవాడు, అతడే క్రమంగా దేవునిగా పూజింపబడుతూ విష్ణువుతో కలిపివేయబడినాడని కొందరు అభిప్రాయపడుచున్నారు. వాసుదేవకృష్ణుడు మాత్రం మొదట మానవుడే అనీ, తరువాత దేవునిగా భావించబడుతున్నాడనీ చాలామంది చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు బార్త్, హాప్కిన్స్ మాత్రం కృష్ణుడు మొదట మానవుడనే అభిప్రాయాన్ని అంగీకరించలేదు.

క్రీస్తుకు పూర్వం అయిదవ శతాబ్దానికి చెందినట్లు భావించ బడుతున్న పాణినియొక్క అష్టాధ్యాయిలో, వాసుదేవక, వాసుదేవ అనే పేర్లు ఉన్నాయి. "మెథోర" "క్లైసొబొర" అనే పట్టణాలలో, శౌరసేనులనే తెగకు చెందినవారు హెరాక్లిస్ ను ప్రత్యేక భక్తితో పూజించుచున్నారని మెగస్థనీస్ తన యిండికాలో వ్రాసియున్నాడు. "మెథోరా" "క్లైసొబొర" నగరాలు మథురా, కృష్ణపురాలుగను, శౌరసేనులు సాత్వతులుగను, హెరాక్లిస్ వాసుదేవకృష్ణుడుగాను చరిత్రకారులు భావిస్తున్నారు. సైనికులకు యుద్ధోత్సాహం కలిగించే నిమిత్తం హెరాక్లిస్ విగ్రహాన్ని, పోరస్ (పురుషోత్తముడు) సైన్యం ముందు నిలిపేవారని కర్టియస్ వ్రాసి యున్నాడు. కాని యీవిగ్రహం శివునిది కాని, యక్షునిది కాని అయి ఉండవచ్చునని శ్రీకుమారస్వామి అభిప్రాయపడుచున్నారు.

గ్రీకురాయబారి అయిన హెలియోడరస్ వాసుదేవ భక్తుడయినట్లు క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దానికి చెందిన బీస్‌నగర శిలాశాసనం చెబుతుంది. రాజపుత్రస్థానంలోని ఘోసుండివద్ద దొరకిన శిలాశాసనంలో సంకర్షణ వాసుదేవమందిరం యొక్క ప్రసక్తి ఉంది. అందుచేత క్రీస్తుకు పూర్వం నాలుగవ శతాబ్దానికి వాసుదేవుని ప్రధానంగా ఆరాధించే మతం వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది. కాని అశోకుని శిలాశాసనాల్లో, బ్రాహ్మణ, శ్రమణ, అజీవిక, నిర్గ్రంథ అనేపేర్లు ఉన్నాయి కాని వాసుదేవుని పేరు చేర్చబడలేదు అందుచేత ఆకాలంలో కూడా వాసుదేవ మతం ఉన్నా, విశేషమైన వ్యాప్తిలో లేకపోయి ఉండవచ్చును.

కృష్ణుని కాలాన్ని నిర్ణయించడానికి సరియైన ఆధారాలులేవని ఆధునిక చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు. మహాభారత యుద్ధసమయాన్ని బట్టి కృష్ణుని కాలనిర్ణయానికి ఆధునికులు అంగీకరించరు. ఛాందోగ్యోపనిషత్తులో దేవకీపుత్రుడైన కృష్ణుడు, ఆంగీరసగోత్రుడైన ఘోరుడనే ఋషికి శిష్యుడైనట్లు చెప్పబడింది. ఈ ఉపనిషత్తు బుద్ధునకు పూర్వమందు వ్రాయబడిందని భావించబడుతుంది కాబట్టి క్రీస్తుకు పూర్వం ఏడవ శతాబ్దం కాని, ఆరవ శతాబ్దం కాని కృష్ణుని కాలమై ఉండవచ్చును. ఉత్తరాధ్యయన సూత్రం అనే జైనగ్రంథంలో 22వ తీర్థంకరుడైన అరిష్టనేమికి వాసు దేవకృష్ణుడు సమకాలీనుడని చెప్పబడింది. ఇదికూడా పై అభిప్రాయాన్నే బలపరుస్తుంది. (సశేషం)

చిత్రసమీక్ష:

# ఉయ్యాల – జంపాల

రవి, మధుబాబులు ఒక తల్లి గర్భాన జన్మించక పోయినా, చిన్నతనం నుంచి అన్నదమ్ముల్లాగా పెరిగారు. జమీందారుగారు తన కుమారుడైన రవినే గాక, తన స్నేహితుని కుమారుడైన మధుబాబుని కూడా కన్న కొడుకులా పెంచుతాడు. మధుబాబు పెద్దవాడు. రవి చిన్నవాడు, కాలేజీలో బి. ఏ. చదువుతూంటాడు.

ఒకనాడు గ్రామీణ ప్రాంతానికి వెళ్ళిన రవి అక్కడ శశి అనే అందమైన అమ్మాయిని చూస్తాడు, ప్రేమిస్తాడు. ఆ ప్రాంతాల్లోనే వేరుగా తిరుగుతున్న మధుబాబు కూడా అదే అమ్మాయిని చూడటం, ఫొటో తీయటం జరుగుతుంది.

మధుబాబు 'స్వతహా' గా 'శాడీ' తత్వం కలిగినవాడు. అక్కడే అనాథ శరణాలయంలో కనిపించిన మరో అమ్మాయిని మోహగించి, తానే రవినని చెప్పి పెళ్ళాడుతాడు.

తన అనుమతి లేకుండా రవి ఒక అమ్మాయిని పెళ్ళాడినట్లు తెలిసికొన్న జమీందారు రవిని ఇంట్లోంచి పంపించివేస్తాడు. రవి గ్రామానికి వచ్చి అక్కడి స్కూల్లో ఉపాధ్యాయుడుగా చేరి గ్రామీణుల అభిమానం సంపాదిస్తాడు. కాని, ఇంతలోనే మునసబుగారితో వైరం రావటంవలన రవికి సమస్యలు ఎదురవుతాయి. మునసబుగారి పక్షం నుంచి, తన అన్నే అక్కడి గ్రామీణ సమస్యను పరిష్కరించటానికి రావటంతో రవికి వాతావరణం ప్రతికూలమవుతుంది. మధుబాబు తాను పెళ్ళాడిన పిల్లను అక్కడ చూస్తాడు. రవిబాబు తొలుత ప్రేమించిన అమ్మాయి శశి కూడా అక్కడే ఉండటంతో కథ మలుపు తిరుగుతుంది.

చివరకు జమీందారుగారికి అసలు సంగతంతా బోధపడుతుంది. మధుబాబును అందరూ నిందిస్తారు. రవికి తాను కోరిన అమ్మాయితోనే వివాహం అవుతుంది. అందరూ కలిసి ఉయ్యాలలూగుతారు.

జగ్గయ్య రవిగా, ప్రభాకరరెడ్డి మధుబాబుగా నటించారు. గ్రామీణ ప్రాంతపు అమ్మాయి శశిగా కృష్ణకుమారి, ఇతర పాత్రలలో వాసంతి, రమణారెడ్డి, గుమ్మడి, కె. వి. ఎస్. శర్మ నటించారు.

చలం, మీనాకుమారి అందించిన హాస్యం బావుంది.

కథ అందరికీ తెలిసింది కావటంవల్ల, సంఘటనలు మామూలుగా ఉండేవి కావటంవల్లనూ ఈ చిత్రంలో కొత్తదనం లేదు. ఒకటి రెండు పాటలు బావున్నాయి.

ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన శ్రీ తిలక్ లోగడ ముద్దుబిడ్డ, ఎం. ఎల్. ఎ. లాంటి చక్కని చిత్రాలకు కూడా దర్శకత్వం వహించారు.

—'ఎక్స్'

"ఉయ్యాల జంపాల"లో కృష్ణకుమారి.

'మాంగల్యమే మగువధనం' లో దేవిక

చిత్రసమీక్ష:

# మాంగల్యమే మగువ ధనం

తమిళంలో విజయవంతంగా ప్రదర్శింపబడిన 'అన్నై యిల్లమ్' ను తెలుగులో శ్రీనివాస్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారు 'మాంగల్యమే మగువధనం' గా అనువదించారు.

ఈ చిత్రంలో ఎస్. వి. రంగారావు, శివాజీగణేశన్, ముత్తురామన్, నాగేష్, దేవిక, జయంతి, సరస్వతి నటించారు.

పరిస్థితుల ప్రభావానికి మానవు డెలా దాసుడవుతాడో ఈ చిత్రం చక్కగా నిరూపిస్తుంది.

శివాజీ గణేశన్, దేవికల నటన సమర్థవంతంగా ఉన్నది. ఎస్. వి. రంగారావు తమ నటనతో చిత్రానికి జీవం పోశారు. నాగేష్ హాస్యం చక్కగా ఉన్నది.

సరస్వతి, జయంతి తమ పాత్రలను అర్థం చేసుకొని నటించారు. వీరింకా కృషిచేస్తే తమ నటనకు మెరుగులు దిద్దుకోడానికి అవకాశం ఉన్నది.

ఈ చిత్రాన్ని ఫిబ్రవరి, 18 వ తారీఖున చిల్డ్రన్స్ థియేటరులో పత్రికా విలేఖరులకు సమీక్షార్థం చూపించారు.

మొత్తంమీద ఈ అనువాద చిత్రం నిర్మాతలకు ఆర్థికంగా సంతృప్తిని కల్గిస్తుందని ఆశించవచ్చు.

—మాధవ్



జీవయాత్రలో ఒక ఘట్టం. (ఫొటోలు: ప్రభాకర్)

అతనిది కేరళ రాష్ట్రంలో ఒక పల్లె. పేద్ద సంసారంలో పుట్టినవాడు. తల్లి తండ్రీ పల్లెలోనే ఉంటారు. ఇతనికి తోబుట్టువులు ఎందరో ఉన్నారు. పేద ఇంట్లో పుట్టిన కారణంగా జీవితంలో పైకి వచ్చే అవకాశాలు ఏవీ రాలేదు. కనీసం, అలాంటి అవకాశాలను సృష్టించుకోనే పరిధికి సమీపంలో నయినా అతను లేడు.

అతని వయస్సు 14 సంవత్సరాలు.

*　　　*　　　*

సరిగ్గా సంవత్సరం రోజులనాటి మాట. అప్పటికతను కేరళలోనే ఉన్నాడు. పనంటూ ఏమీ లేదు. అమ్మకు, నాన్నకు ఏదైనా పనుల్లో సాయంచేసి పెడుతూండేవాడు. ఆ పసి వయస్సులో అతను చేయగలిగింది కూడా అంతకన్నా మరేమీ లేకపోయింది. పదమూడేళ్ల స్థితిలో ఎవరైనా మటుకు ఏం చేయగలరు. ఆడుతూ, పాడుతూ సరదాగా గడపవలసిన అతని బాల్యంలో సంతోషానికి బదులు దుఃఖం ప్రవేశించింది.

అసలే పేద కుటుంబం. చదువు సంధ్యలు లేనివాడు. ఎలా జీవించాలి ? ఎంతకాలం తనూ ఇక్కడ ఉండగలడు ?

ఇదే సమస్య అతనికి ఎదురయింది. మరికొన్ని రోజులలోనే ఒక నిశ్చయానికి వచ్చాడు.

మనచుట్టూ ప్రపంచం

వాశిరాజు ప్రకాశం

# హోటల్ సర్వర్ గంగాధర్ విచిత్రగాధ

అమాయకత్వం గూడు కట్టుకొన్న ఆముఖము ఎంతో ప్రశాంతంగాను, నిశ్చలంగాను వుంది. అతను పలికే ప్రతి పలుకులోను మంచి తనము, మాటనేర్పరి తనము పుష్కలంగా వున్నా యనిపించింది. మాట్లాడిన ప్రతిమాటా చక్కగా, ముద్దుగా, జాపరికం లేకుండా మాట్లాడాడు. అతనితో మాట్లాడుతున్నంత సేపు భారతీయ జనజీవనంతో మరికొంత పరిచయాన్ని పొందుతున్నట్లు, నా చుట్టూవున్న ప్రపంచాన్ని గురించి మరికొంత తెలిసికొంటున్నట్లు అనిపించింది.

ముక్కుపచ్చ లారకమునుపే జీవితాన్ని అన్వేషిస్తూ యాత్రను సాగించిన వ్యక్తి ఆ అబ్బాయి. చిన్నప్పటి ముద్దు, ముచ్చట తీరకమునుపే తల్లి, తండ్రులను వదలి వూరుకాని వూరు వచ్చి, వచ్చీ రాని భాష మాట్లాడుతూ, తెలిసీ తెలియని సాంగత్యంతో జీవనం చేస్తున్నాడు .... పేరు గంగాధర్!

మద్రాసు నగరంలో తెలుగువారికి సుపరిచితమైన ఒక హొటల్లో అతను సర్వర్గా పని చేస్తున్నాడు. చక్కటి రూపురేఖలు కలిగినవాడు. పరిస్థితులను చక్కగా ఆకళింపుచేసుకొన గలవాడు.

కాని, సరస్వతీదేవి అనుగ్రహం కొరవడినందున కాబోలు, యీ వృత్తిలో ప్రవేశించవలసిన అగత్యం ఏర్పడింది.

*　　　*　　　*

నేనూ, మా ప్రభాకర్ కలిసి ఎక్కడెక్కడో తిరిగి, చివరకు భోజనానికి వెళ్లటం, అక్కడ యీ అబ్బాయి పలుమార్లు కనిపించటం జరిగింది. మేము వెళ్లినప్పుడల్లా ఎంతో ఆసక్తిగా మాట్లాడేవాడు. ఎన్నెన్నో ప్రశ్నలు వేశాడు. తనకు తెలియని సంగతులెన్నో తెలిసికోవాలనే కుతూహలం చూపేవాడు. అతనిలో కనిపించిన ప్రత్యేకత, ఆకర్షణలే యీ వ్యాసానికి తోడ్పడ్డాయంటే అతిశయోక్తి కాదేమో !

'మనం ఇలాంటివాళ్లను గురించి మన పత్రికలో ఎందుకు వ్రాయగూడదు ?' అనుకొన్నాం నేనూ, ప్రభాకర్. వీళ్ల జీవితాలు ఎక్కడ ఆరంభమవుతాయో, ఎక్కడ గట్టెక్కుతాయో, ఇలాంటి ఉద్యోగస్తులకు ఎలాంటి సమస్యలు ఎదురవుతాయో తెలిసికోవాలని, తెలిసికొన్నదేదో నలుగురికీ చెప్పాలని అనుకొన్నాం.

అప్పటినుంచి యీ అబ్బాయిని గురించి కొంత కొంతగా తెలిసికోవటం ఆరంభించాం. తనకూ, తన పుట్టుకకీ సంబంధించిన ఎన్నెన్నో సంగతులను చెపుతుండేవాడు. తన కష్ట సుఖాలను హృదయం విప్పి, విన్నవించుకొనేవాడు.



గంగాధర్.

చిత్రసమీక్ష

# ఉయ్యాల - జంపాల

రవి, మధుబాబులు ఒక తల్లి గర్భాన జన్మించక పోయినా, చిన్నతనం నుంచి అన్నదమ్ముల్లాగా పెరిగారు. జమీందారుగారు తన కుమారుడైన రవినే గాక, తన స్నేహితుని కుమారుడైన మధుబాబుని కూడా కన్న కొడుకులా పెంచుతాడు. మధుబాబు పెద్దవాడు. రవి చిన్నవాడు, కాలేజీలో బి. ఏ. చదువుతూంటాడు.

ఒకనాడు గ్రామీణ ప్రాంతానికి వెళ్ళిన రవి అక్కడ శశి అనే అందమైన అమ్మాయిని చూస్తాడు, ప్రేమిస్తాడు. ఆ ప్రాంతాల్లోనే వేరుగా తిరుగుతున్న మధుబాబు కూడా అదే అమ్మాయిని చూడటం, ఫోటో తీయటం జరుగుతుంది.

మధుబాబు 'స్వతహా' గా 'శాడి' తత్వం కలిగినవాడు. అక్కడే అనాథ శరణాలయంలో కనిపించిన మరో అమ్మాయిని మోసగించి, తానే రవినని చెప్పి పెళ్ళాడుతాడు.

తన అనుమతి లేకుండా రవి ఒక అమ్మాయిని పెళ్ళాడినట్లు తెలిసికొన్న జమీందారు రవిని ఇంట్లోంచి పంపించివేస్తాడు. రవి గ్రామానికి వెళ్ళి అక్కడి స్కూల్లో ఉపాధ్యాయుడుగా చేరి గ్రామీణుల అభిమానం సంపాదిస్తాడు. కాని, ఇంతలోనే మునసబుగారితో వైరం రావటంవలన రవికి సమస్యలు ఎదురవుతాయి. మునసబుగారి పక్షం నుంచి, తన అన్నే అక్కడి గ్రామీణ సమస్యను పరిష్కరించటానికి రావటంతో రవికి వాతావరణం ప్రతికూల మవుతుంది. మధుబాబు తాను పెళ్ళాడిన పిల్లను అక్కడ చూస్తాడు. రవిబాబు తొలుత ప్రేమించిన అమ్మాయి శశి కూడా అక్కడే ఉండటంతో కథ మలుపు తిరుగుతుంది.

చివరకు జమీందారుగారికి అసలు సంగతంతా బోధపడుతుంది. మధుబాబును అందరూ నిందిస్తారు. రవికి తాను కోరిన అమ్మాయితోనే వివాహం అవుతుంది. అందరూ కలిసి ఉయ్యాలలూగుతారు.

జగ్గయ్య రవిగా, ప్రభాకరరెడ్డి మధుబాబుగా నటించారు. గ్రామీణ ప్రాంతపు అమ్మాయి శశిగా కృష్ణకుమారి, ఇతర పాత్రలలో వాసంతి, రమణారెడ్డి, గుమ్మడి, కె. వి. ఎస్. శర్మ నటించారు.

చలం, మీనాకుమారి అందించిన హాస్యం బావుంది.

కథ అందరికీ తెలిసింది కావటంవల్ల, సంఘటనలు మామూలుగా ఉండేవి కావటంవల్లనూ ఈ చిత్రంలో కొత్తదనం లేదు. ఒకటి రెండు పాటల్లో బావున్నాయి.

ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన శ్రీ తిలక్ లోగడ ముద్దుబిడ్డ, ఎం. ఎల్. ఎ. లాంటి చక్కని చిత్రాలకు కూడా దర్శకత్వం వహించారు.

—'ఎక్స్'



"ఉయ్యాల జంపాల"లో కృష్ణకుమారి.



'మాంగల్యమే మగువధనం' లో దేవిక

చిత్రసమీక్ష

# మాంగల్యమే మగువ ధనం

తమిళంలో విజయవంతంగా ప్రదర్శింపబడిన 'అన్నైయిల్లమ్' ను తెలుగులో శ్రీనివాస్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారు 'మాంగల్యమే మగువధనం' గా అనువదించారు.

ఈ చిత్రంలో ఎస్. వి. రంగారావు, శివాజీగణేశన్, ముత్తురామన్, నాగేష్, దేవిక, జయంతి, సరస్వతి నటించారు.

పరిస్థితుల ప్రభావానికి మానవు డెలా దాసుడవుతాడో ఈ చిత్రం చక్కగా నిరూపిస్తుంది.

శివాజీ గణేశన్, దేవికల నటన సమర్థవంతంగా ఉన్నది. ఎస్. వి. రంగారావు తమ నటనతో చిత్రానికి జీవం పోశారు. నాగేష్ హాస్యం చక్కగా ఉన్నది.

సరస్వతి, జయంతి తమ పాత్రలను అర్థం చేసుకొని నటించారు. వీరింకా కృషిచేస్తే తమ నటనకు మెరుగులు దిద్దుకోడానికి అవకాశం ఉన్నది.

ఈ చిత్రాన్ని ఫిబ్రవరి, 18 వ తారీఖున చిల్డ్రన్స్ థియేటరులో పత్రికా విలేఖరులకు సమీక్షార్థం చూపించారు.

మొత్తంమీద ఈ అనువాద చిత్రం నిర్మాతలకు ఆర్థికంగా సంతృప్తిని కల్గిస్తుందని ఆశించవచ్చు

—మాధవ్



జీవయాత్రలో ఒక ఘట్టం. (ఫొటోలు: ప్రభాకర్)

మనచుట్టూ ప్రపంచం

వాశిరాజు ప్రకాశం

# హోటల్ సర్వర్ గంగాధర్ విచిత్రగాధ

అమాయకత్వం గూడు కట్టుకొన్న ఆముఖము ఎంతో ప్రశాంతంగాను, నిశ్చలంగాను వుంది. అతను పలికే ప్రతి పలుకులోను మంచి తనము, మాటనేర్పరి తనము పుష్కలంగా వున్నా యనిపించింది. మాట్లాడిన ప్రతిమాటా చక్కగా, ముద్దుగా, జాపరికం లేకుండా మాట్లాడాడు. అతనితో మాట్లాడుతున్నంత సేపు భారతీయ జనజీవనంతో మరికొంత పరిచయాన్ని పొందుతున్నట్లు, నా చుట్టూవున్న ప్రపంచాన్ని గురించి మరికొంత తెలిసికొంటున్నట్లు అని పించింది.

ముక్కుపచ్చ లారకమునుపే జీవితాన్ని అన్వేషిస్తూ యాత్రను సాగించిన వ్యక్తి ఆ అబ్బాయి. చిన్నప్పటి ముద్దు, ముచ్చట తీరకమునుపే తల్లి, తండ్రులను వదలి వూరుకాని వూరు వచ్చి, వచ్చీ రాని భాష మాట్లాడుతూ, తెలిసీ తెలియని సాంగత్యంతో జీవనం చేస్తున్నాడు .... పేరు గంగాధర్!

మద్రాసు నగరంలో తెలుగువారికి సుపరిచితము లైన ఒక హోటల్లో అతను సర్వర్‌గా పని చేస్తున్నాడు. చక్కటి రూపురేఖలు కలిగినవాడు. పరిస్థితులను చక్కగా ఆకళింపుచేసుకొన గలవాడు.

కాని, సరస్వతీదేవి అనుగ్రహం కొరవడినందున కాబోలు, యీ వృత్తిలో ప్రవేశించవలసిన అగత్యం ఏర్పడింది.

* * *

నేనూ, మా ప్రభాకర్ కలిసి ఎక్కడెక్కడో తిరిగి, చివరకు భోజనానికి వెళ్లటం, అక్కడ యీ అబ్బాయి పలుమార్లు కనిపించటం జరిగింది. మేము వెళ్లినప్పుడల్లా ఎంతో ఆసక్తిగా మాట్లాడే వాడు. ఎన్నెన్నో ప్రశ్నలు వేశాడు. తనకు తెలియని సంగతులెన్నో తెలిసికోవాలనే కుతూహలం చూపేవాడు. అతనిలో కనిపించిన ప్రత్యేకత, ఆకర్షణలే యీ వ్యాసానికి తోడ్పడ్డాయంటే అతిశయోక్తి కాదేమో!

'మనం ఇలాంటివాళ్లను గురించి మన పత్రికలో ఎందుకు వ్రాయగూడదు ?' అనుకొన్నాం నేనూ, ప్రభాకర్. వీళ్ల జీవితాలు ఎక్కడ ఆరంభమవుతాయో, ఎక్కడ గట్టెక్కుతాయో, ఇలాంటి ఉద్యోగస్తులకు ఎలాంటి సమస్యలు ఎదురవుతాయో తెలిసికోవాలని, తెలిసికొన్నదేదో నలుగురికీ చెప్పాలని అనుకొన్నాం.

అప్పటినుంచి యీ అబ్బాయిని గురించి కొంత కొంతగా తెలిసికోవటం ఆరంభించాం. తనకూ, తన వృత్తికీ సంబంధించిన ఎన్నెన్నో సంగతులను చెపుతుండేవాడు. తన కష్ట నిష్ఠురాలను హృదయం విప్పి, విన్నవించుకొనేవాడు.



గంగాధర్.

అతనిది కేరళ రాష్ట్రంలో ఒక పల్లె. పెద్ద సంసారంలో పుట్టినవాడు. తల్లీ తండ్రీ పల్లెలోనే ఉంటారు. ఇతనికి తోబుట్టువులు ఎందరో ఉన్నారు. పేద ఇంట్లో పుట్టిన కారణంగా జీవితంలో పైకి వచ్చే అవకాశాలు ఏవీ రాలేదు. కనీసం, అలాంటి అవకాశాలను సృష్టించుకొనే పరిధికి సమీపంలో నయినా అతను లేడు.

అతని వయస్సు 14 సంవత్సరాలు.

* * *

సరిగ్గా సంవత్సరం రోజులనాటి మాట. అప్పటి కతను కేరళలోనే ఉన్నాడు. పనంటూ ఏమీ లేదు. అమ్మకు, నాన్నకు ఏదైనా పనులలో సాయంచేసి పెడుతూండేవాడు. ఆ పసి వయస్సులో అతను చేయగలిగింది కూడా అంతకన్నా మరేమీ లేకపోయింది. పదమూడేళ్ల స్థితిలో ఎవరైనా మటుకు ఏం చేయగలరు. ఆడుతూ, పాడుతూ సరదాగా గడపవలసిన అతని బాల్యంలో సంతోషానికి బదులు దుఃఖం ప్రవేశించింది.

అసలే పేద కుటుంబం. చదువు సంధ్యలు లేనివాడు. ఎలా జీవించాలి ? ఎంతకాలం తనూ ఇక్కడ ఉండగలడు ?

ఇదే సమస్య అతనికీ ఎదురయింది. మరికొన్ని రోజులలోనే ఒక నిశ్చయానికి వచ్చాడు.

మద్రాసు నగరంలో అతని దగ్గర బంధువు లొకరున్నారు. ఆ బంధువు దగ్గరకొస్తే ఏదైనా ఆశ్రయం చూపకపోతాడా ?—అని అతని ఆశ.

ఆ ఆశతోనే ఇల్లు విడిచి మద్రాసు చేరుకున్నాడు.

"మద్రాసు వచ్చేముందు అమ్మకు, నాన్నకు చెప్పి వచ్చావా ?" అని అడిగాం.

"అమ్మా, నాన్నా స్వయంగా పంపారు." అన్నాడబ్బాయి నవ్వుతూ, తాను పారిపోయి దొంగతనంగా రాలేదనే భావం అతని మాటల్లో వ్యక్తమయింది.

మద్రాసు వచ్చాడు. తనవారనుకొన్న ఒక వ్యక్తి వెంట చేరి, కొత్త జీవితాన్ని ఆరంభించాడు. స్థానికంగా ఉన్న తెలుగువారి హొటల్లో సర్వర్ పని దొరకటానికి ఎంతో కాలం పట్టలేదు.

ఈనా డతను ఒక ఉద్యోగి. స్వయంకృషితో



"తెలుగు నేర్చుకోవాలని నాకెంతో సరదా."

ధనార్జన చేస్తూ, జీవయాత్ర చేస్తున్న వ్యక్తి.

* * *

'వూరు విడిచి ఎందుకు వచ్చావ్ బాబూ' అని అడిగాం.

'ఎందు కేమిటి ? బ్రతకటానికి' అన్నా డతను.

'ఏం ? ఉద్యోగం అంత ముఖ్యమా ?' మా యీ ప్రశ్నకు అతను సుదీర్ఘంగా ఆలోచించాడు. ఆ తరువాత "ఔను. ముఖ్యమే. మా ఇంట్లో ఎంతకాలమని వూరక ఉండేది" అన్నా డతను.

తల్లి, తండ్రుల భారాన్ని తగ్గించటం, పైగా తను ప్రయోజకు డయ్యాడనే సత్యంతో వారిని సంతోషపరచటమే అతని కర్తవ్యమని చెప్పాడు. అందుకే తానీ సర్వర్ పని చేస్తున్నా నన్నాడు ఆ అబ్బాయి.

ఇతని కథ విన్న తరువాత, ఇతని ఆశయాలు



అందరూ భోజనాలు చేసి వెళ్ళిన తరువాత నిద్రపోతాను.

తెలిసికొన్న తరువాత ఇతని జీవితం ఎలా ఉంటుందో, ఈ అబ్బాయి రోజువారీ కార్యక్రమం ఏమిటో తెలిసికోవాలనే కుతూహలం కలిగింది. అందువల్ల ఒకనాడు ఆ అబ్బాయితోనే చాలాకాలం గడిపాము నేనూ, మా ప్రభాకర్ !

రాత్రిళ్ళు బాగా పొద్దుపోయిన తరువాతనే నిద్ర పోయినప్పటికీ, ఉదయాన పెందలకడనే నిద్ర లేవటం అతని విధి, విధ్యుక్తధర్మం. ప్రొద్దున్నే నిద్ర లేవగానే కాలకృత్యాలు ముగించుకొంటూండగానే, త్వరగా సిద్ధం కావలసిందంటూ, 'ఉద్యోగధర్మం' వీపు చరుస్తుంది. అదే హొటల్లోనే అతని నివాసం కనుక (చాలామందికీ అంతే) పని మొత్తం నిూద ఎక్కువగానే ఉంటుంది. ఉదయాన పని మొదలెట్టేముందు అతను కొద్ది నిముషాలు దైవప్రార్థన చేస్తాడు. అతని కిష్టమైన దైవాన్ని (పేరు చెప్పలేదు) తలచుకొంటూ రోజువారీ జీవితాన్ని ప్రారంభిస్తాడు.

"ఎందుకు బాబూ, దేముణ్ణి తలచుకోవటం?" అని అడిగాను. అతను వెంటనే ఏమీ చెప్పలేకపోయాడు. కొద్ది నిమిషాల తర్వాత "మా అమ్మ చెప్పింది. అందుకే దేముడికి దణ్ణం పెట్టుకుంటాను" అన్నాడబ్బాయి మెల్లిగా, నవ్వుతూ.

"అసలు అందరూ దేముడికి ఎందుకు దణ్ణం పెడ్తారో తెలుసునా బాబూ" అని మళ్ళీ అడిగాను, ఆ అబ్బాయి దృక్పథాన్ని తెలిసికొనేందుకు.

"ఏమో, అదంతా నాకు తెలీదు" అంటూ ఆ అంశాన్ని ముగించా డతను.

* * *

జీవితం సుఖదుఃఖాల సమన్వయ రూపం.

56 వ పేజీ చూడండి



పరిశ్రమకు ప్రతిఫలం.

## ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ తాజాచిత్రం ప్రారంభం

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి తాజా చిత్రం మొదటి షూటింగ్ షెడ్యూలు జనవరి 12 నుంచి 19 వరకూ హైదరాబాద్ శ్రీ సారధీ స్టూడియోలో జరిగింది. ఈ షెడ్యూల్‌లో నాగేశ్వరరావు, జగ్గయ్య సావిత్రి, హేమలత పాల్గొన్నారు. రెండవ షెడ్యూలు ఫిబ్రవరి 15 వ ఆరంభ మవుతుంది. ఇందులో పై వారితోపాటు కొత్త నటి కుమారి జయలలిత

# చిత్రలహరి

కూడ ఉంటుంది. కథ : యద్దనపూడి సులోచనా రాణి. సంభాషణలు : ఆచార్య ఆత్రేయ, సంగీతం : టి. చలపతిరావు, దర్శకత్వం : కె. ప్రత్యగాత్మ, నిర్మాత : ఏ. వి. సుబ్బారావు.



'నాదీ ఆడజన్మే'లో హరనాథ్, జమున

## కీలుబొమ్మలు సంసిద్ధం

హైదరాబాద్ మూవీస్‌వారి "కీలుబొమ్మలు" చిత్రం పూర్తి అయింది. జమున, జగ్గయ్య ప్రధాన భూమికలు పోషించిన యీ చిత్రానికి డి. వి. నరస రాజు బి. ఏ. సంభాషణలు వ్రాశారు. సంగీతం: కోదండపాణి. దర్శకుడు : సి. ఎస్. రావు బి. ఏ. (లిట్), సహకార దర్శకుడు : పి. సాంబశివరావు, నిర్మాత : పి. గంగాధరరావు.

## హిందీలో కూడా 'వీరాభిమన్యు'

భీముడు, ఘటోత్కచుడు—తండ్రీ కొడుకుల మని తెలియక సమరం సాగిస్తారు. ఆ ఘోర పోరాటాన్ని గత నెల 28 న వాహినీలోని మొదటి ఫ్లోర్‌లో చిత్రీకరించారు. ఈ భారీ "వీరాభిమన్యు" చిత్రం పూర్తికావస్తున్నది. భీమునిగా దండ మూడి రాజగోపాలరావు, ఘటోత్కచునిగా నెల్లూరు (పహిల్వాన్) కాంతారావు యిందులో నటి స్తున్నారు.

ఈ చిత్రంలోని యుద్ధ దృశ్యాలను లార్జి స్కేల్‌లో తీయదలచినట్లు చెప్పారు శ్రీ డూండీ. 'వీరాభిమన్యు' హిందీలో నిర్మించే యోచన తమకు కలదనీ—అయితే అది యింకా ఆలోచనలోనే, అను కోవడంలోనే ఉన్నదనీ కూడ అన్నారు ఆయన.

## శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణుకథ

శ్రీ శంభూఫిలిమ్స్‌వారి "శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణుకథ" చిత్రంలో కుమారి జమున కథా నాయిక భూమిక పోషించేందుకు నిర్ణయం జరి గింది. కథా నాయకుడిగా ఎన్. టి. రామారావు నటించుతారు. మిగిలిన ముఖ్య పాత్రల్లో ఎస్. వి. రంగారావు, రేలంగి, ఎల్. విజయలక్ష్మి, గిరిజ, ఛాయాదేవి, ప్రసాద్ మొదలయినవారు ఉన్నారు. స్క్రిప్టు దగ్గుబాటి చౌదరి తయారు చేశారు. కథ, మాటలు, పాటలు : పింగళి నాగేంద్రరావు, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు. ఇటీవల ఈ చిత్రంలోని మూడు పాటలను— జానకి సోలో ఒకటి, సుశీల, వసంత బృందం పాడినది మరొకటి, పి. లీల బృందం పాడినది ఇంకొకటి రికార్డు చేశారు. నృత్యాలు : పసుమర్తి కళ . తోట, ఎడిటింగ్ : సత్యం, సహాయ దర్శకుడు : చెరువు ఆంజనేయ శాస్త్రి, దర్శకత్వం : ఏ. కె. శేఖర్. ఈ చిత్రం ఏప్రిల్ మాసంలో సెట్స్‌కు వెళ్లబోతున్నట్లు చెప్పారు నిర్మాత శ్రీ దగ్గుబాటి లక్ష్మీనారాయణ చౌదరి.

## సతీసక్కుబాయి

చిన్ని బ్రదర్స్‌వారి "సతీ సక్కుబాయి" పాట రికార్డింగ్‌కు ఫిబ్రవరి 6 వ తేదీన వాహినీ స్టూడి యోలోని "ఏ" థియేటర్‌లో ఉదయం ఎనిమిది గంటల పదిహేను నిమిషాలకు నటి శ్రీమతి అంజలీదేవి ఆధ్వర్యంలో జరిగింది. ఫిలిం పరిశ్రమకు చెందిన ప్రముఖులు శ్రీ గోగినేని వెంకటేశ్వరరావు హాజరయినారు.

"ఘల్లు ఘల్లుమని గజ్జెలు మ్రోయగ
గంతులు వేయుచు రారా......"

సముద్రాల రాఘవాచార్యులు వ్రాసిన ఈ గీతం ఆదినారాయణరావు సంగీత దర్శకత్వంలోను సుశీల పాడగా వాహినీ సౌండ్ రికార్డిస్ట్ వి. శివరావ్ రికార్డ్ చేశారు. ఆదినారాయణరావుగారి సంగీతంలోని కమ్మదనం మళ్ళా ఈ పాటలో ధ్వనించు తున్నది. వేదాంతం రాఘవయ్య దర్శకత్వంలో రూపొందబోతున్న ఈ చిత్రం మార్చినెలనుంచి సెట్స్‌కు వెళ్లనున్నది.

## సత్యహరిశ్చంద్ర

విజయా ప్రొడక్షన్స్‌వారి "సత్యహరిశ్చంద్ర" నిర్మాణం పూర్తి అయింది. సర్వజనాకర్షణీయంగా తయారయిన ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు నాగయ్య, ముక్కామల, రాజనాల, రమణారెడ్డి, రేలంగి, బాలకృష్ణ ప్రభాకరరెడ్డి, ఏ. వి. సుబ్బారావు (జూనియర్) యస్. వరలక్ష్మి, రాజశ్రీ మొదలయినవారు నటించారు. మాటలు, పాటలు : పింగళి నాగేంద్రరావు, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, కళ : గోఖలే, కెమెరా : కమల్‌ఘోష్, దర్శకత్వం : కె. వి. రెడ్డి. ఈ చిత్రం ఆంధ్రలో విజయపిక్చర్స్ వారి ద్వారా విడుదల అవుతుంది.

## శ్రీకృష్ణ పాండవీయం

ఎన్. ఏ. టి. వారి "శ్రీకృష్ణ పాండవీయం" షూటింగ్ నిర్విరామంగా కొనసాగుతున్నది. ఎన్. టి. రామారావు, కె.ఆర్. విజయ, గీతాంజలి, కాంతారావు, ముక్కామల, రాజనాల మున్నగువారు నటించుతున్న ఈ చిత్రానికి సంభాషణలు సముద్రాల రాఘవాచార్య రూపొందించారు. గీతాలు : సముద్రాల, సి. నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం : టి. వి. రాజు, నృత్యాలు : వెంపటి సత్యం, కళ : టి. వి. యస్. శర్మ, కెమెరా : రవికాంత్, నిర్మాత: ఎన్. త్రివిక్రమరావు.

## ప్రేమించిచూడు

పద్మశ్రీ వారి "ప్రేమించి చూడు" చిత్రం శీఘ్రగతిని హైదరాబాద్ శ్రీ సారథీ స్టూడియోలో నిర్మించబడుతున్నది. ఫిబ్రవరి 24 నుండి మార్చి 11 వ తేదీ వరకు షెడ్యూలు వేశారు. ఇదే చివరి షెడ్యూలు. దీనితో ఈ చిత్ర నిర్మాణం పూర్తి అవుతుంది. ఇంతవరకు నాలుగు పాటలు చిత్రీకరణ జరిపారు. ఇందులో మొత్తం ఉన్న ఎనిమిది పాటలను ఆరుగురు ప్రఖ్యాత రచయితలు వ్రాశారు. శ్రీ శ్రీ, సి. నారాయణరెడ్డి, దాశరథి, ముళ్ళపూడి వెంకటరమణ ఒక్కొక్కటి, ఆత్రేయ రెండు, ఆరుద్ర రెండు గీతాలు వ్రాశారు.

"దొరికారు దొరగారు
ఇక నన్ను విడలేరు"— అని అమ్మాయి అంటే "దొరికారు దొరగారు, ఇక నిన్ను విడబోరు .... ఆశలన్ని తీరేదాకా ఆగలేరు" అంటూ అబ్బాయి ఆలపించే యీ గీతం శ్రీ శ్రీ వ్రాసినది. వేణు సంగీత దర్శకత్వంలో ఫిబ్రవరి 16 న శారదా స్టూడియోలో ఘంటసాల, సుశీల, పాడగా రంగస్వామి రికార్డ్ చేశారు. చిత్రంలో జగ్గయ్య, కాంచనలపై చిత్రీకరించుతారు.

ఇందులో నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, చలం, రాజశ్రీ, కాంచన, గిరిజ, శాంతకుమారి మొదలయిన వారు నటించుతున్నారు. సంపూర్ణ హాస్యరసభరితంగా నిర్మించబడుతున్న యీ చిత్రానికి సంభాషణలు ముళ్లపూడి వెంకటరమణ వ్రాశారు. దర్శకత్వం : పి. పుల్లయ్య, బి. ఏ. నిర్మాత : వి. వెంకటేశ్వర్లు బి. ఏ.



సురేష్ పిక్చర్స్ జానపద చిత్రం ప్రారంభానికి, చి. సురేష్‌బాబు కెమెరా స్విచ్ ఆన్ చేస్తున్నప్పటి చిత్రం.

## శివశక్తిమూవీస్

"వీరప్రతాప్" అని యీ చిత్రానికి మొదట నామకరణం చేయడం జరిగింది. ఆ పేరుతో గతంలో ఒక డబ్బ్‌డ్ చిత్రం వచ్చేసిందనీ, ఆ సంగతి తెలియక తాము ఆ పేరు పెట్టడం జరిగిందనీ—యిప్పుడా పేరును ఉపసంహరించుకుంటున్నామనీ, ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ శ్రీ డి. బి. నారాయణ యిటీవల వీనస్ స్టూడియోలో తెలియజేశారు.

## దొరికితేదొంగలు

చందమామా వారి "దొరికితే దొంగలు" చిత్రం సెన్సారు అయింది. ఫిబ్రవరి చివరి భాగంలో విడుదల కాబోతున్నది. సర్వజనాకర



ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "తేనెమనసులు"లో సంధ్యారాణి, సుకన్య.

# చిత్రలహరి

జేయంగా శ్రీ డి. ఎల్. రూపొందించిన యీ చిత్రములో జమున, ఎన్.టి. రామారావు, కాంతారావు, శారద, రాజశ్రీ, జయంతి, గుమ్మడి, రమణారెడ్డి మున్నగువారు నటించారు. రచన: పినిశెట్టి, సంగీతం: రాజేశ్వరరావు, దర్శకుడు: సుబ్రహ్మణ్యం. నవయుగ ఫిలిమ్స్ ద్వారా యీ చిత్రం ఆంధ్రలో విడుదల అవుతుంది.

## చంద్రహాస

తనకు రక్షణ కల్పించిన విషయం పట్ల చంద్రహాస హృదయంలో కృతజ్ఞతాభావం పెల్లుబికింది. "విషయా, కృతజ్ఞుణ్ని. నీవు చేసిన ఉపకారం నే నెన్నటికీ మరచిపోలేను." అన్నాడు.

"నీ రాకతో నా కిప్పుడు నిజం తెలిసింది.



'మంగమ్మశపథం'లో జమున.

నా జీవితంలో చంద్రోదయమైంది. నా కన్నుల్లో వెన్నెలలు కాస్తున్నాయి. ఇంక నిన్ను విడచి ఒక్క క్షణం ఉండలేను" అన్నది విషయ. ఆమె మనస్సు ఉత్సాహంతో ఉరకలేస్తున్నది. చెలికాని తలచి హృదయం మురిసిపోతున్నది. అతని చేతిని తన చేతుల్లోకి తీసుకున్నది.

చంద్రహాస నవ్వి "వెర్రిదానా! నీ కిప్పుడే ప్రేమోదయమైనట్లుంది" అన్నాడు.

"ప్రేమా, అదేమిటి?" అడిగింది ఆశ్చర్యంగా చూస్తూ.

"ప్రేమా!" విషయ కళ్లల్లో కళ్లు పెట్టి "నీవు యువతివి, నేను యువకుణ్ని" అన్నాడు.

"అది నాకు తెలిసింది. ప్రేమంటే ఏమిటని అడుగుతున్నాను" అన్నది అమాయకంగా.

ముట్లా చూసి "ప్రేమంటేనా?" అంటూ

శివ, పార్వతుల విగ్రహాన్ని చూసి "యువతీ యువకులు ప్రేమించుకుంటారు. అంటే నీవంటి యువతి అనుమానం తన ప్రియుణ్ణి చూస్తూ అతనితోనే మాట్లాడుతూ ఆనందిస్తుంది !" చెప్పాడు.

"అవు నవును ! నా మనస్సులో అలాగే ఆనందం ఉప్పొంగుతుంది...." అంటూ తన మనోభావాన్ని వ్యక్తపర్చుతూ "మరి యువకుడో ?" అని అడిగింది. అతని ఉద్దేశాన్ని గూడా తెలుసుకోవాలని.

"యువకుడూ అంతే ! తన ప్రియురాలి వంకే చూస్తూ, మాట్లాడుతూ ఆనందిస్తాడు."

విషయకు విషయం అర్థమైపోయింది. తన జీవిత భాగస్వామి యితడేనని నిశ్చయించుకున్నది. "అయితే నేను నిన్ను ప్రేమిస్తాను. అన్యుడెవడూ నా కక్కర్లేదు. (అంటూ చెంతకు వచ్చి) నువ్వింక నాతోటే ఉంటావా ?" అడిగింది.

"వెర్రిదానా ! నే నెలా ఉండగలను ! నువ్వు ప్రేమిస్తే మాత్రం మన ప్రేమ ఫలిస్తుందా ?"

విషయ స్తంభించిపోయింది. ఆమె హృదయం గిలగిల లాడింది. చిరుగాలికి వొణికే తీగలా కంపించినది. తన ఆశలు, కలలు కల్లలు కాబోతున్నవా? ఏమిటీ వైపరీత్యం ? చంద్రహాస ఎందు కిలా అంటున్నాడు. తన ప్రేమను అతడు స్వీకరించడా? తనను చేపట్టడా ?

"ఏం, నీకు ప్రేమలేదా ?" అడిగినది తత్తర పాటుతో—రసవత్తరమైన ఈ సన్నివేశం విక్రమ్ ప్రొడక్షన్స్ వారి "చంద్రహాస" చిత్రంలోనిది. విషయగా కృష్ణకుమారి, చంద్రహాసగా హరనాథ్ నటించారు.

ఈ చిత్రంలో ఇంకా గుమ్మడి, ధూళిపాళ, జూనియర్ వి. వి. సుబ్బారావు, రాజ్ బాబు, సత్యనారాయణ, మాస్టర్ బాబు, డా. శివరామకృష్ణయ్య, రామకోటి, శ్రీకాంత్, కాశీనాథ్, మోదుకూరి సత్యం గోపాలకృష్ణ, పండరీబాయి, వాణిశ్రీ, పుష్పవల్లి, సూర్యకళ, సబితాదేవి, రాధాకుమారి మొదలయిన వారు నటించుతున్నారు.

సదాశివబ్రహ్మం సంభాషణలు రూపొందించారు. గీతాలు : దాశరథి, సంగీతం : ఎస్. హనుమంతరావు, నృత్యాలు : పి. ఎస్. గోపాలకృష్ణన్, వెంపటి సత్యం, ఏ. కె. చోప్రా, ఆర్ట్ : వాలి, కెమెరా : బి. ఎస్. హరిదాస్, ఎడిటర్ : పి. జి. మోహన్, అసోసియేట్ డైరెక్టర్స్ : టి. దయాసాగర్, కె. ధర్మరాజ్, నిర్మాత,దర్శకుడు : బి. ఎస్. రంగా, విక్రమ్ స్టూడియోస్‌లో నిర్మాణం జరుగుతున్న యీ చిత్రం ఆంధ్రలో నవయుగ ఫిలిమ్స్ వారి ద్వారా విడుదల అవుతున్నది.

## మాంగల్యమే-మగువధనం

శ్రీనివాస్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి "మాంగల్యమే మగువ ధనం" సాంఘికచిత్రం ఈ ఫిబ్రవరి 19 వ తేదీన ఆంధ్రదేశమంతటా విడుదలయింది. ఈ చిత్రంలో శివాజీగణేశన్, యస్. వి. రంగారావు, నాగేష్, ముత్తురామన్, నంబియార్, దేవిక, జయంతి, కుమారి సరస్వతి, ఎం.ఎస్. రాజమ్మ ప్రభృతులు నటించారు. మాటలు, పాటలు:అనిసెట్టి, సంగీతం: కె.వి. మహాదేవన్ అండ్ పెండ్యాల శ్రీనివాస్, దర్శకుడు: పి. మాధవన్, నిర్మాతలు: టి.ఎస్. శ్రీనివాస్, అండ్ ఎస్. నాగసుబ్రహ్మణ్యం.

— మోహన్ కుమార్ ★

భారీయెత్తున దేశరక్షణకు
ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# అవీ - ఇవీ - అన్నీ

## రామచరిత మానస్

**మూలం:తులసీదాసు; తెలుగు: ముంగర శంకరరాజు, చిత్తూరు; ప్రచురణ: ప్రేమచంద్ పబ్లికేషన్స్, విజయవాడ; మూల్యం: 12-00.**

ఆంధ్ర సచిత్రవారపత్రికలో కొన్ని మాసాల పాటు ధారావాహికంగా వెలువడిన తులసీదాసకృత రామచరితమానస్ తెలుగు అనువాదం గ్రంధరూపములో వెలువడింది.

వివిధ భాషలలో రూపొందిన ఉత్తమ రామాయణాలలో 'రామచరితమానస్' కూడా ఒకటి. తులసీదాసు భక్తాగ్రేసరుడైన మహాకవి కావటం వల్లనే యీ 'రామచరితమానస్' ఇంత రమ్యంగా రచించగలిగాడు. ప్రతి పద్యంలోను, ప్రతి భావనలోను భక్తి పొంగిపొర్లి వచ్చేవిధంగా ఉండటం ఈ గ్రంధంయొక్క విశిష్టత.

అంత చక్కటి గ్రంధాన్ని శ్రీ ముంగర శంకర రాజుగారు సకలజనామోదకరంగా తెలుగు చేశారు. శ్రీ శంకరరాజుగారు హిందీ, తెలుగు—రెండు భాషల్లో కూడా చక్కని ప్రవేశాన్ని, పాండిత్యాన్ని పొందిన వారు. అందువల్ల ఈ అనువాదాన్ని జయప్రదంగా, సఫలీకృతంగా చేశారు.

సహజంగా శ్రీ తులసీదాసు రచనలు, చాలా వరకు, క్లిష్టతరంగా వుంటాయి. అలాంటి రచనను అర్థం ఎక్కడా చెడిపోకుండా, చాలా రమ్యంగా శ్రీ శంకరరాజు గారు తెనిగించటం అభినందనీయమే. తేట తెనుగు పదజాలం ద్వారా చక్కని అర్థస్ఫూర్తిని కలుగ చేస్తూవున్నది యీ అనువాదం. శ్రీరాముణ్ణి మహాకవి తులసీదాసు ఎలా చిత్రించారో, తన మనస్సులో ఎలా ధ్యానించారో ఇందులో ఆకర్షణీయమైన శైలిలో వివరించబడింది.

శ్రీ 'పుట్టపర్తి' పీఠిక వ్రాశారు. ఉత్తరాది నుంచి సుప్రసిద్ధ హిందీ సాహిత్యకారులు శ్రీ మైథిలీ శరణ్ గుప్త ఆశీస్సులు పంపారు. చక్కని ముద్రణ, ఆకర్షణీయమైన రంగుల ముఖచిత్రం యీ గ్రంధానికి వన్నెతెచ్చాయి.



జె. కె. హెలెన్ కర్టిస్ లిమిటెడ్ సంస్థకు చెందిన ఎగ్జిక్యూటివ్ మార్కెటింగ్ ఇంజనీరు శ్రీ టి. యస్. రామన్, యు.కె., యు.యస్.ఎ; తదితర దేశాల్లో పర్యటించే నిమిత్తం బయలు దేరి వెళ్లారు.

## కార్యసిద్ధి

**రచన: ముద్దా చిట్టిబాబు, మద్రాసు; ప్రచురణ: ప్రేమచంద్ పబ్లికేషన్స విజయవాడ. మూల్యం:రు3-00. (మామూలు పోస్టులో)రు3-50(రిజిష్టరుపోస్టులో).**

గణేశ్వరదేవుని లీలావిలాసములు, మహిమలను గురించిన కథల సంపుటి ఇది. ఆంధ్రసచిత్రవార పత్రికలో గత సంవత్సరం ధారావాహికంగా వెలువడిన యీ కథలను గ్రంధరూపంలో పునర్ముద్రించారు. వివిధగ్రంధాలలో ప్రస్తావించబడిన శ్రీ గణేశునికి సంబంధించిన సంఘటనలను, ముచ్చట్లను చదివి, వాటిని చక్కని కథలుగా శ్రీ ముద్దా చిట్టిబాబు రూపొందించారు. మొత్తం ఇరవైఐదు కథలున్నాయి.

శ్రీచిట్టిబాబు అత్యాధునికమైన శైలిలో, విషయంయొక్క ప్రాధాన్యతను విస్మరించకుండా, అందరికీ అర్థంఅయేలా యీ కథలను చెప్పారు. మొత్తంమీద అంశం ఒకటే అయినా, ఇవన్నీ దేనికది కథలరూపంలో వుండటం వల్ల ఎంతో ఆసక్తికరంగా రూపొందాయి. ఆధ్యాత్మికమైన అంశాన్ని తీసికొని, ఇంత చక్కగాను, కావ్యంగాను చెప్పటం కష్టతరమే.

శ్రీ పి. గణపతిశాస్త్రిగారు సందర్భోచితంగా చక్కని పరిచయాన్ని వ్రాశారు. సరాగమ్ స్టూడియో వారి బొమ్మలు బావున్నాయి.

శ్రీచిట్టిబాబు యీరచన ద్వారా చేసిన అసాధారణమైన సాహితీయత్నం నిస్సందేహంగా నెరవేరింది.

## "సింగపూర్ సి ఐ డి"

శ్రీనివాస్ మూవీస్ వారు నిర్మిస్తున్న తొలి ఈస్ట్మన్ కలర్ డిటెక్టివ్ తెలుగు చిత్రం త్వరలో ఆంధ్రదేశమంతటా విడుదల కానున్నది.

ఈ చిత్రంలో బి. సరోజాదేవి, జానకి, శివాజీ గణేశన్ మొదలగువారు నటించారు. రచన: ఆరుద్ర. సంగీతం: విశ్వనాధన్—రామమూర్తి; దర్శకత్వం: దాదామిరాసి; నిర్మాతలు: సూరవరపు భాస్కరావు, యర్రా కన్నయ్య.



చిత్రనిర్మాత శ్రీ తారాచంద్ బారాజాత్యా కుమార్తె రాజశ్రీకి, శ్రీ ధరంచంద్ సరాగి కుమారుడు శ్రీ చంద్రకుమార్ కు ఇటీవలనే బొంబాయిలో వివాహం జరిగింది.

# సర్వర్ గంగాధర్

49 వ పేజీ తరువాయి

సర్వర్ల జీవితాలూ అంతే. వాళ్ళకు కూడా ఎన్నో సమస్యలు, ఎన్నో యిబ్బందులు ! అయినా, రోజు గడవాలి. తిండి కావాలి. తిప్పలు పడాలి. తప్పదు.

మద్రాసు నగరంలో ఇలాంటి వ్యక్తు లెందరో ఉన్నారు. ఒక అంచనా ప్రకారం— పెద్ద, చిన్న హోటళ్ళన్నీ కలిపితే— 1272 ఉన్నాయి. వీటిలో కేవలం సర్వర్లుగా దాదాపు 30 వేల మంది, పని చేస్తున్నారు.

అలానే ఇన్నివేల మంది సర్వర్లకూ ఎన్నెన్నో సమస్యలు. కుటుంబ సమస్యలు కొన్ని, వృత్తి సమస్యలు కొన్ని !

'సర్వర్' అన్న తరువాత మనలో చాలామంది 'అబ్బే' అని పెదవి విరుస్తారు. వాళ్ల జీవితాన్ని గురించి, వాళ్ల స్థానాన్ని గురించి తెలిసికొనే అవకాశం చాలామందికి ఉండదు.

పెద్దపెద్ద నగరాలలో, పెద్ద హోటళ్లలో సర్వర్లకు ఎంతో గౌరవం ఉంది. చాలామంది ఇతర ఉద్యోగస్తులకంటె ఈ సర్వర్లకు జీతాలు కూడా ఎక్కువగా వస్తాయి.

కొన్నిచోట్ల సర్వర్‌లకు (పెద్ద హోటళ్లలో) భోజనం, కాఫీ సౌకర్యం మాత్రమే కలుగజేస్తారు. హోటలుకు వచ్చినవారు 'టిప్స్' పేరుతో ఇచ్చే డబ్బే వారికి మిగులుతుంది.

అమెరికాలాంటి దేశాల్లో హోటల్ సప్లయిర్లు కూడా కార్లలో వచ్చి వెళుతుంటారు. అతన్ని కూడా అందరిలాగా 'సర్' అని పిలవాలి.

కువాయత్ దేశంలో గత సంవత్సరంలో ఒక నెలలో ఒక సప్లయిర్‌కు వచ్చిన మొత్తం, మన రెండువేల మూడువందల రూపాయిలకు సమానం. అతణ్ణి గురించి అక్కడి ఒక ఉర్దూ పత్రిక ప్రచురించిన వ్యాసాన్ని ఇటీవలనే చదవటం జరిగింది.

ఇలా చెప్పుకపోతే పేజీల తరబడి ముచ్చట్లు ఉన్నాయి. సందర్భం గంగాధర్ చరిత్ర కాబట్టి అతని ఆశయాలతోనే యీ వ్యాసాన్ని ముగిస్తాను. భూమ్మీద జన్మించాక ప్రతి ఒక్కరికీ కొద్దో గొప్పో వూహాలు ఉండటం సహజం. అలావే గంగాధర్‌కు కూడా ఎన్నో ఉన్నాయి.

చదువుకోవాలని అతని మొదటి అభిలాష.

నిజంగా అభినందించదగిన అంశం మరోటి ఉన్నది. అతనికి ఇంతకు మించిన ఆశలేవీ లేవు. "కారు కొనుక్కొని, అందులో వెళ్తావా?" అని అడిగాను, ఆ అబ్బాయిని వూరించాలనే అభిప్రాయంతో.

అందుకు, ఆ అబ్బాయి నవ్వి "ఎందుకండీ నాకు కారు ? అసలు నాలాంటి వాడికి కారు ఎలా వస్తుంది" అని చెప్పా డతను.

ఎలా వస్తుందో ?

మొత్తంమీద గంగాధర్‌తో మాట్లాడటం విలేఖరిగా నా కెంతో సంతోషాన్నిచ్చింది. చక్కని కాలక్షేపమూ అయింది. వ్యక్తిగా ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చింది. తరచి చూస్తే, ఇలాంటి జీవితాల చాటుననే జీవితసత్యాలు మరుగుపడి ఉంటాయేమో !

★

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



చంద్రకాంత